# కృతిపతి ప్రశంస

---

శ్రీ రాజిల్లుచుఁ బేరువెం పొలయుకాశీనాథవంశంబునన్
ధీరోదారుఁడు నా జనించిన జగద్విఖ్యాతు నాగేశు, వి
స్తారవ్యాపృత దానవాహినులు విశ్వం బెల్లెడన్ బర్వి నీ
పారావారపరీత భూవలయభూభర్తల్ వెఱఁగొందఁగన్.

నిత్యమంగళసహితుఁడై నెగడునీదు
జీవితేశుని వామాంకసీమయందు
శాశ్వతంబుగ రాజిల్లు సర్వసంప
దలను జెందుచు మత్కవితాకుమారి!

శీతలకిరణాల శీకరించెడునట్టి
చందురుని గళంక మొందియుండు
అఖిలజనులచేత నర్చింపఁబడుచుండు
నట్టికవిని లేమి పట్టివేఁపు
కలిమిచేఁ దులదూఁగి మెలఁగెడుధనవంతుఁ
బాడు లోభగుణంబు వీడ దెందు
అధికారసంపత్తి నలరుచుండెడివారి
కెల్ల గర్వము బాయ దెల్లకల్ల
ఏదియో యొకలోపం బదెల్లవారిఁ

బాదుకొనుఁ గాని తనయందు లే దటంచు
అఖిలజనజిహ్వా నాట్యశాలాంతరమున
న ర్తనము సల్పు నీమనోనాథుకీ ర్తి.

వేనూరు లెన్నియో వెనుదీయ కొసఁగియుఁ
గవులయాశీస్సులఁ గాంచినాఁడు
శర ణని వేఁడిన బరమశత్రువునైనఁ
గరుణించి రక్షింపఁ గడఁగినాఁడు
అనిశంబు తనదుగృహాంగణసీమ దా
తృత్వవాహినులఁ బారించినాఁడు
ఎనలేనిదానంబు లే ప్రొద్దుఁ గావించి
దానకర్ణుని పేరుఁ దాల్చినాఁడు
పటుతరంబైన శుభకీర్తి బడసినాఁడు
దానకంకణ మిరు కేలఁ దాల్చినాఁడు
అఖిలసౌభాగ్యసంపద లందినాఁడు
లేఁ డెవఁడు తల్లి నీభర్త కీడు ధరణి.

ఆణిముత్తెంబుల హారముల్ కంఠాన
ధరియించి స్వేచ్ఛమై దిరుగు మింక
నవరత్నఖచితమౌ నవ్యంపుగద్దెపై
శృంగారచేష్టలఁ జెలఁగు మింక
పండువెన్నెలబోలు నిండారుయౌవనం
బున నిష్కళంకతఁ దనరు మింక

చంద్రకాంతోపలసౌధాగ్రములపైని
మంచిపువ్వులఁ బవ్వళించు మింక
కవులవాగ్డోలికలమీఁదఁ గాంక్షఁ దేలి
యూఁగి యానందవార్ధిని దోఁగియాడి
పరు లనుభవించియెఱుఁగని వైభవములఁ
బొంది వర్ధిల్లుమమ్మ యపూర్వగతిన.

బొంకులు గావు మద్వచనముల్, నిజముల్, భవదీయభర్త మీ
నాంకుఁడు రూపసంపద, ధనాధిపుఁ డంచితవైభవాన, ని
శ్శంకల దానవాహినులు బారెడు కర్ణుఁడె; యట్టివాని వా
మాంకతటంబునన్ వరలు మమ్మరో, యాశశితారకంబుగన్.

ఇట్లు
జి. జోసపుకవి

# ఉపోద్ఘాతము

భూలోకమందు దేశోద్ధారకులును సుగుణకలాసమన్వితులును స్వామికార్యనిర్వాహకులును సనాతనధర్మపరాయణులును ధీరవరేణ్యు లగు దైవభక్తులును నాదిగాఁగల మహాపురుషపుంగవు లుద్భవించి వారివారి జీవితచారిత్రంబుల లోకంబున కాదర్శప్రాయంబుగాఁ జేసి దివం బలంకరించిరి. అట్టి మహానీయుల నామధేయంబులును వారివారి యశఃప్రతాపంబులును సత్యవిజ్ఞానసంపన్నత్వంబులును లోనగు నీతుల మఱువఁజాలక పుణ్యపురుషులచారిత్రంబుల లోకంబున నాచంద్రతారార్కస్థాయిగా రాజిల్లునటుల విద్వత్కవీంద్రు లగణిత ప్రబంధరాజంబులును కావ్యములును దృశ్యప్రబంధంబులును ఆఖ్యాయికలును సృష్టించి వెలువరించుచు నాంధ్రభాషావధూటికిని తన్మహానీయపుంగవులకు సేవఁ జేయుచు మెలంగుచున్నవారలు. ప్రథమగణ్యం బని జగతి విఖ్యాతిఁ గాంచి విలసిల్లు ఇమ్మహాభరతవర్షంబున పేరుగడించి భక్తాగ్రేసరు లనం బరగి వర్ధిల్లినవారిలో ప్రముఖుఁ డగువాఁ డీ సుప్రసిద్ధమైన కథానాయకుండును పరమభక్తుండును నగు చంద్రహాసుండు.

కొండొకదినంబున ఇమ్మహానీయుని దివ్యచారిత్రంబు ప్రసంగవశంబునఁ బ్రశంసించుచు, నియ్యది మిగుల ప్రశస్త

మైనది. ఇద్దానిని గద్యరూపంబున వ్రాయు మని నా చిరపరి చితు లగు కీర్తిశేషులైన శ్రీ కంభంపాటి రంగారావుపంతులు గారును, మహారాజరాజశ్రీ తాటిపర్తి యల్లమందాఖ్యుఁడును, శ్రీయుత గాలి చినపిచ్చయ్యగారును నన్నెంతయో ప్రోత్స హించిరి. కాని యించుకంతయేనియు భాషాపరిజ్ఞానం బెఱుంగని వాఁడ నగుటంబట్టి "నక్కయెక్కడ నాకలోకం బెక్కడ" యన్నట్లు, భాషావిహీనతచేఁ గుందు నే నెక్కడ, యిట్టి యుత్కృష్టగ్రంథరాజంబును సమర్థింపఁగలఁడనాయని వారితో తత్సమయంబున వచియించితిని. కొలఁదిదినంబులకు ప్రయ త్నమే పురుషలక్షణం బన్నట్లు విద్వత్కవితల్లజులు వీక్షించి కరుణార్ద్రహృదయులై యిందు వాటిల్లు ప్రమాదంబుల సైఁప కుందురా యని మొండిధైర్యం బవలంబించి మద్గురువరేణ్యు లగు బ్రహ్మశ్రీ రాయప్రోలు చిదంబరముశాస్త్రిగారి యనుగ్ర హంబున నార్జించిన యల్పభాషాజ్ఞానంబున శబ్దశాస్త్రసిద్ధాంత ములుగాని భాషాపరిచయము గాని యెఱుంగకయ యిద్దానిని వ్రాయ సమకట్టితిని.

రసపోషణకై స్థాలీపులాకన్యాయంబుగ పూర్వలిఖితా క్షరభావంబు లిం దిమిడ్చితి. ఇద్దాని కృతిఁబొంది నన్నానంద భరితమానసునిఁగా నొనర్చువా రెవరా ?

అని చింతించుచుఁ, గుందుచుఁ౯ సతతముఁ౯

అత్యుగ్రచాంచల్యముల్

మనముఁ బాధలపాలుఁ జేయఁ గని మ
దమల్లాదివంశాబ్ధిపూ
ర్ణచంద్రుం డగు వేంకటేశ్వరులు నన్
రక్షింప నీక్షించి తా
వినిపించెన్ ఒకపుణ్యశాలికథ స
త్ప్రేమంబు లుప్పొంగఁగన్.

కాశీనాథవంశసంజాతుండును, దేశోద్ధారకబిరుదాంకితుండు నగు శ్రీ శ్రీ నాగేశ్వరరావుమహాశయుండు జగద్విఖ్యాతిఁగాంచి ప్రశస్తభాగ్యస్వరూపులై విలసిల్లుచున్నవారలు.

పొందినాఁడు యశము భూమీశులను మించి
యధికమహా దానంబు లాచరించి
బ్రతికించుచున్నాఁడు పండితప్రముఖుల
నలయక వేతనంబుల నొసంగి
కలిపించుచున్నాఁడు ఘనతరవిద్యల
బీదబాలురు నిండు మోద మొంద
పెట్టించుచున్నాఁడు పేదల కెనలేని
యన్నసత్రంబుల నన్నియెడల
అతనిశుభకీర్తి సుగుణసత్కారవల్లి
అల్లిబిల్లిగ దిక్కుల నలమికొనియె
ఆమహాత్మునిప్రాపున కరిగి నీవు
విన్నవింపుము సాంతంబు విశదపడఁగ.

తా వచించినసూక్తులు తథ్య మనుచు
నంతరంగాన దృఢపర్చి హర్ష మొంది
యెట్టకేలకు మద్రాసు కేనయ నరిగి
విన్నవించితి సాంతంబు విశదపడఁగ.

కాశీనాథకులాంబురాశికిని రాకాచంద్రబింబంబ, నా
గేశారాధ్యుఁడ దేశభక్తుఁడ మహేంద్రేశాది తుల్యుండ, నే
నాశాపాత్రుఁడ చంద్రహాసచరితం బత్యంతశ్రద్ధాళునై
ధీశాలీ, రచియించితిన్ గృతిగొనన్ ధీమంతునిన్ వేఁడెదన్.

సప్తసంతానప్రశస్తిఁ గాంచిన మీకు
నఖిలభోగంబులు నమరుఁగాత
తాపత్రయవ్యథోద్ధతి నెఱుంగని మీకు
నిష్టాన్నదాతృత్వ మెసఁగుఁగాత
బహుపుత్త్రమిత్రలాభము గణించిన మీకు
భోగసంపదలు గ్రమ్ముకొనుఁగాత
పంచఖండాలలో ప్రజ లెల్లరును మీకు
నిదె మంగళములు పల్కుదురుగాత

అతులభక్తుండు గాంధీ మహాత్ముఁ డనవ
రతము కొండవైన నీతో డుండి రాజితముగ
స్వస్తివచనాలు ప్రీతితోఁ జదువుఁగాత
సకలకల్యాణ మగు మీకు సర్వగతుల.

అని యాశీర్వచనపురస్సరముగాఁ బ్రార్థింపఁ జెవియొగ్గి
కరుణారసస్వాంతుండై నీవృత్తాంతత చేమన్న,

శ్రీలతోఁ గొమరొప్పి శ్రేష్ఠమై చెన్నారు
వినుకొండపురము నా జననభూమి
కవిచంద్రుఁడై భువిఁ గల్యాణములఁబొంది
యొప్పుచిదంబర మొజ్జ నాకు
అత్యద్భుతంబగు నాంధ్రగద్యను వ్రాయ
నుదకమాస్వాదించు విధము నాకు
సత్కావ్యసారముల్ సంగ్రహించుటటన్న
భ్రమరపుష్పమరందభాతి నాకు
చారుపద్యాల విరచింప సంతసమ్ము
కవులపుట్టిల్లు మాసీమ కదనభూమి
విపులతేజఃప్రతాప, వివేకసాంద్ర,
రమ్యగుణధామ, నాగేశరాయమహాళి.

కరుణాసింధుఁడు ధర్మబద్ధుఁడు జగత్కల్యాణలోలుండు సం
భరితప్రాభవవై భవాన్వితుఁడు శుంభద్రత్నసింహాసనాం
తరసంశోభితుఁ డార్యసన్నుతరమాధారేయునిం జేరి తా
హారితుల్యంబున శాంతదృష్టి నగ నీ హర్షించి బల్కెన్ గృపన్.

నీదు గ్రంథంబు తప్పక నేర్పుమీఱ
గృతిని బొందువాఁడ మిగుల ముదముతోడ

నుడుగుమీ దుఃఖభారంబు కడురయంబు
ఆర్యజననుత, యోజోసపాగ్రగణ్యా.

అని యభయం బొసంగి నిరుపమాన యశోవిభాసియును, కాశీనాథవంశకలశపాథోరాశి పూర్ణ శశాంకుండును నగు బ్రహ్మశ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు మహామహుండు కరుణారసస్వాంతుఁడై నాగ్రంథముఁ గృతిఁబొంది న న్నానందభరితాంతఃకరణునిగా నొనర్చి యాచంద్రతారార్కస్థాయిగా కీర్తినాపాదించి విరాజిల్లుచున్నవారలు. జోహారులు.

ఈ గ్రంథమునఁ బొడగట్టు ప్రమాదంబుల దయార్ద్రహృదయులై పండితప్రముఖులు క్షమియింప భక్తిపూర్వకముగా వేఁడుకొనుచు ఈ నవీనయుగంబున మనఃపూర్వకముగ నే నొసంగు నీ భక్తినిబద్ధప్రసవాంజలినిఁ బరిగ్రహింప సతత స్వాతంత్ర్యశీలురగు భారతీయులను నమస్కారపురస్సరంబుగ వేఁడుకొనుచున్నాఁడను.

వినుకొండ
౧-౮-33.

ఇట్లు విద్వజ్జన విధేయుఁడు,
జి. జోసపుకవి.

# తొలి పలుకు

సంసారతాపతప్తు లగు మానవుల మనంబుల నానందింపఁజేయఁ గావ్యామృతరసాస్వాదన మొక్కటియ యని ప్రాచీనాలంకారికులు నిరూపించియున్నవారలు. ద్వివిధ మగు గద్యపద్యకావ్యములలోఁ బద్యకావ్యము ప్రౌఢమై సాహిత్యవిజ్ఞానసంపన్నులకుమాత్రము గ్రాహ్యమైయుండుఁ గాని, గద్యకావ్య మన్ననో సామాన్యజనులకు సుగమమై యక్లేశముగఁ జదువ ననుకూలమైయుండును. పద్యప్రబంధంబు నందువలె, గద్యకావ్యమున నిర్బంధములు తక్కువ. నీతిబోధకములును, విజ్ఞానదాయకములును, ధర్మన్యాయవర్తనములును గలిగి ప్రాపంచికవిషయములను గఱపుచుఁ బాఠకునిమనంబున కొకవిధముగ నూతనోత్సాహవికాసములను గలిగించునవియే నవీనవచనరచనలు. ప్రాచీనసంప్రదాయములు నిప్పటి పద్ధతులు నిందుఁ బొందుపఱచి చంద్రహాసచరిత్రము రచియింపఁబడియె. ఇందలి కథ ప్రఖ్యాతము. కొన్నిచోట్ల వర్ణనాభూయిష్ఠంబును, ప్రౌఢపదోపేత దీర్ఘసమాసజాలంబును గలది యయ్యు శైలి నాతికఠినమై రమణీయంబై చదువంజదువం జవులు దేలుచుఁ బలుకుపూఁబోఁడికి నూత్నాలంకారముగ వెలయుచుండెడి. శృంగారవీరకరుణాదిరసములు సందర్భోచితముగాఁ బోషితము లయ్యె. పుత్త్రప్రాప్తికి దంపతు లొనరించు వ్రతోపవాసాదినియమములును, సన్మార్గదుర్మార్గవర్తనులకు వారి

కృత్యములే కాలాంతమందుఁ బక్వములై ఫలానుభవంబును గలిగించు ననుటయు, యువకులు ధనసంపన్నులు నాధికారిక స్థితి నున్నప్పు డనుభవజ్ఞులయాజ్ఞానుసారము మెలంగవలె ననుటయు దైవభక్తులగు ధీవరేణ్యుల కెప్పట్లను విజయము సేకూరు ననియు లోనగునీతు లాయాసందర్భమునఁ జక్కఁగఁ బొందుపఱుపఁబడినవి. ఇవియునుంగాక చంద్రహాసునకు లోకయాత్రోపకారకములగు ననేక నీతులు బోధింపఁబడినవి. గ్రంథకర్తృప్రథమప్రయత్న మగుటచే దీర్ఘసమాసఘటకముల రసపోషణకై కొన్నిచోట్ల స్ఖాలిత్యములు ప్రమాదవశంబున వాటిల్లినను సముదాయముమీఁద రసవంతమై, నీతివిజ్ఞానదాయకమై చదువరుల కెంతయు నానందముఁ గలిగించెడునని తలంచెద. పఠనీయగ్రంథనిర్ణాయక సభవారును, భాషాభిమానులగు మహాశయులు నేతద్గ్రంథము ఉత్తమతరగతివిద్యార్థులకుఁ బఠనీయగ్రంథముగ నిర్ణయించిరేని గ్రంథకర్తృపరిశ్రమమున కుపకరించువారలు, తద్భాషాసేవకుఁ బ్రోత్సహించువారలు నగుదు రని నమ్మెదను.

ఇట్లు,

ముక్తినూతులపాటి గోపాలకృష్ణశాస్త్రి,

మానసికశాస్త్రాదిగ్రంథప్రణేత,

సంస్కృతాంధ్రపండితుఁడు, ఏ. బి. యం. కళాశాల

వంగోలు :

25-1-33.

# పండితాభిప్రాయములు

—:0:—

వత్సా! మీచే రచియింపఁబడిన 'చంద్రహాసము' అను గ్రంథము నామూలాగ్రముగఁ జూచితి. శైలి మిగుల హృద్యమును, నాతికఠినమునునై సూరిజనాదరణీయ మగుచు నున్నతపాఠశాలలలోని యుత్తమకక్ష్యలకుఁ బఠనీయగ్రంథముగనుండుటకుఁ దగియున్నది. ప్రయత్నంబు ప్రథమంబయ్యు రచన ప్రశంసనీయముగ నున్నది. సర్వేశ్వరుఁడు మీరచనాసామర్థ్యము నభివృద్ధి నొనర్చి యింకను భాషాసేవ నొనర్పఁ దోడ్పడుఁగాత.

ఆశీర్వచనములు

బాపట్ల. ఇట్లు

రాయప్రోలు చిదంబరముశాస్త్రి

పహోయోపాధ్యాయుఁడు, మాండలిక సంఘోన్నతపాఠశాల.

---

ఆర్యా! నాకు మీరు పరిశీలించుట కంపిన 'చంద్రహాసము' అను వచనకావ్యము నాద్యంతముఁ దిలకించితిని. ఇయ్యది నాతికాఠిన్యమై మార్దవమై గంభీరమగు గ్రాంథికశైలిని రాజిల్లుచున్నది. నిమ్నజాత్యుద్ధరణమునకుఁ బూనుకొన్న ప్రతిదేశీయుఁడును, దమకుఁ దగురీతి సాయపడుఁగాక. మీగ్రంథమును విద్యాశాఖాధికారులు సాభిమానులై వైశంబ పఠనీయగ్రంథముగ నిర్ణయించెదరుగాక.

గుంటూరు. ఇట్లు

దీవి రంగాచార్యులు

(ప్రొఫెసర్) శతావధాని.

---

మీ వ్రాఁతప్రతి చూచితిని. చాలావఱకు ఆదరణీయముగ నున్నది. మీ రీతుల భాషాసేవ చేయుటకు యెంతయు సంతసించుచున్నాఁడను. మీ పుస్తకము ప్రచారమునకు రావలెను. చిత్తగింపుఁడు

ఇట్లు

విద్వాన్. గ. సోమన్నపంతులు, యం. ఎ., యల్. టి.

Deputy Inspector of Schools, Pithapuram Range.

---

మీచే రచియింపఁబడిన చంద్రహాసమును స్థాలీపులాకన్యాయంబునఁ దిలకించితి. మృదుకీతి యర్థగాంభీర్యము శబ్దాలంకార సహితముగ నలరారుచున్నయది. ప్రథమప్రయత్నమైనను రచన సూరిజనశ్లాఘ్యమై, గ్రంథనిర్ణాయకసభ్యు లనుజ్ఞ నొసంగుటకు తగియున్నది.

నాగులవరము.

ఇట్లు

వెల్లంకి వెంకటసుబ్బయ్యశాస్త్రి

దైవజ్ఞపండితుఁడు.

---

మీచేరచియింపఁబడిన 'చంద్రహాసము'నుఁ దిలకించితిని. ప్రథమారంభమయ్యు నందమై శైలి భావివృద్ధిని సూచించుచున్నది. దీనిఁ గళాశాలాపఠనీయగ్రంథముగాఁ జేకొన నర్హ మని చెప్ప నొప్పు.

వినుకొండ

ఇట్లు

పమిడి క్షేమశాస్త్రి

Retired Telugu Pandit, Board Middle School

---

జి.. జోస్యపుకవిగారు రచించిన 'చంద్రహాస' ము మృదుశైలిని వ్రాసియున్నది. విషయపరంపరలు, యల్లిక మనోహరముగా యున్న దని

చెప్పుటకు సంశయము లేదు. హైస్కూలు తరగతులకుఁ బాఠ్యగ్రంథముగ నియమించుటకు నుపయోగముగా యున్నది.

ము. రామచంద్రారావు, యమ్. ఏ., యల్. టి.

గుంటూరు Head Master, Town High school

---

మీరు వ్రాసిన 'చంద్రహాస' మను గద్యకావ్యముయొక్క వ్రాఁతప్రతిని చూచి మిగుల యానందించితిని. అందు ప్రాముఖ్యముగ మీభాషాపరిచయమును, క్లిష్టమగు సమాసంబులచే నలరారు మీశైలియును గమనించియుంటిని. అందందు పురాణాదిగ్రంథములనుండి గ్రహించినకొన్ని పద్యంబుల సందర్భానుసారముగ మంచినార్యోక్తులకు మూలాధారములుగను ప్రమాణంబులుగ నున్నవి. ఉన్నతకళాశాలలయందలి విద్యార్థులీపుస్తకమును, జదివి యానందింపఁగలుగుటకును, భాషను విశేషపరిశ్రమ చేయుటకును యవకాశములు గలవు. ప్రకృతివర్ణనలను చేయుటయందు చిత్తవృత్తిపరిశోధనలఁ జేయుటయందును మీపుస్తకమందలి భాష మిగుల సమంజసముగ నుపయోగపడుచున్నది. మీగ్రంథమునకు ఆంధ్రవాఙ్మయమునం దొకయగ్రస్థానము తప్పకనేర్పరగల దని నాయభిప్రాయము.

D. Satyanarayanamurty, B. A., L. T.,

Ongole. Head master, Government Trainning School,

---

మీరు రచించిన చంద్రహాసమును, అందందు చదివి చూచితిని. బ్రహ్మశ్రీ పమిడి శేషశాస్త్రిగారన్నట్లు ప్రథమప్రయత్న మైనను ఇందలిశైలి యందమై భావ్యభివృద్ధిని సూచించుచున్నది. విద్యాశాఖాధికారులు మీగ్రంథము నుచితరీతిని మన్నింతు రని నమ్ముచున్నాను.

నెల్లూరు. దీపాల పిచ్చయ్యశాస్త్రి,

21-1-33 Telugu Lecturer, V. R. College,

---

ఈ గద్యకావ్యమును జాలవఱకుఁ జూచితిని. బ్రహ్మశ్రీ ముక్తినూతులపాటి గోపాలకృష్ణశాస్త్రిగారి యభిప్రాయముతో నాయభిప్రాయమును ఏకీభవించినది. ఈకాలమున గద్యకావ్యములే అవసరములు. ప్రకృత కాలగ్రంథములకు నిదియును బహువిషయములఁ దీసిపోవదు. గాన వానితోఁ బాటు దీనిఁగూడఁ దత్తత్కక్ష్యాపఠనీయగ్రంథముగ విద్యాశాఖవారు చేయించి ఈ గ్రంథకర్తకుఁ దగు ప్రోత్సాహమును గలిగింతురుగాత.

గుంటూరు. కాశీ కృష్ణాచార్యులు

---

మిత్రమా! మీ చంద్రహాసమును నే నామూలాగ్రముగఁ బరిశీలించి చూచితిని. నాకు సాధ్య మగునంతవఱకు నచ్చటచ్చట గన్పట్టు లోపముల సవరించితిని. ఇదియే ప్రథమప్రయత్న మగుటచేఁ గాఁబోలు వ్యాకరణదోషములును, భాషయందలి వ్యత్యాసములును గన్పట్టినవి. అది యుందఱకును సాజము. ప్రథమముననే యిట్టియున్నతశైలికి దిగుట నాదృష్టికంత యుక్త మని తోఁపదు. అయినను కథారమణీయతనుబట్టి శైలి యంతగాఁ బాటింపఁబడదు. ఇంకను ప్రయత్నపురస్సరముగ వ్రాయుచో మీ కవిత యుక్తముగానే యుండఁగలదు. గౌణవాచకమున కుపయోగింపఁదలంపున్నచోఁ గఠినపదభూయిష్ఠదీర్ఘసమాసముల నుపయోగించుట యంత యుక్తము కాదేమో యని తోఁచెడిని. మొత్తముమీఁద రచన శ్లాఘ్యము. పదములలాలిత్యముగూడఁ గలదు. కథాభాగము శ్రవణీయమును, నీతిదాయకమును నయి యున్నది. దైవముయొక్క తోడ్పాటు సకలాపన్నివారక మనియు దుస్తంత్రప్రవిష్ఠుల కాపదలును, నపకీర్తియు సంసిద్ధము లని యీకథ నీతిని నేర్పుచున్నది. నీతిదాయకమగు నీకబ్బము నున్నతపాఠశాలలోని విద్యార్థివిద్యార్థినీలోకమునకుఁ బఠనీయముగ వుపయోగించుటకుఁ బాఠ్యగ్రంథనిర్ణాయకులనుజ్ఞ నొసంగుదురుగాత.

ఇట్లు

ఓగిరాల వేంకటేశ్వరశాస్త్రి,

బాపట్ల. ప్రధానాంధ్రోపాధ్యాయుఁడు, బోర్డుహైస్కూలు.

---

# చంద్రహాసము

---

## ప్రథమమంజరి

శ్రీయుతంబై సకలసంపదల కాకరంబై జగతి విఖ్యాతిఁగాంచి విలసిల్లు భరతఖండంబునఁ గేరళం బను రాష్ట్రం బొందు గలదు. తద్రాష్ట్రంబున వాపీకూపతటాకాదులు సర్వదా సారోదకపూరితంబులై చక్రచక్రాంగ ప్రముఖ వివిధవిహంగమసంచారరమ్యంబులై పెంపొసంగుచుండె. వేల్పుటావును నిరసించి పిదుకుచో నుఱ్ఱువేయక త్రికాలంబుల సత్యవ్రతలై ధేనువులు క్షీరంబు లిడుచుండెను. జను లారోగ్యసంపత్తికై సత్త్వంబుల హింసమాని యామిషంబును నర్థింపక శాల్యోదనంబును సారతరశాకంబులును మధురసూపాపూపంబులును హైయంగవీనంబును నానాపక్వఫలంబులును రుచ్యంబులగు భోజ్యంబులును భక్షించుచుఁ బరమేశ్వరారాధన తత్పరులై నిత్యకల్యాణపరంపరలచే వర్ధిల్లుచుండిరి. బ్రాహ్మణోత్తములు నిత్యసత్యవ్రతులు నింద్రియనిగ్రహులును నై యరిషడ్వర్గంబులఁ ద్యజించి త్రికరణశుద్ధులై భక్తిపూర్వకముగాఁ జతుర్వేదంబుల వల్లె వేయుచుండ దేవతాగణంబులు కర్ణరసాయనంబులగు పఠనంబుల విని యానందపరవశులై సూనవృష్టిం గురిపించుచుండిరి.

వెండియుఁ దద్రాజధానీరమణీయసౌధాగ్రంబుల వివిధవర్ణప్రభాభాసమానంబులై యమూల్యరత్ననిర్మితంబులగు ప్రతిమాసహస్రంబులు విలసిల్లుచుండు. హేమమయభాసితంబు లగు ప్రాకారకుడ్యంబు లాకసం బంటు

కొని గారుడోత్కీర్ణంబులును, జంద్రకాంతోపలనిర్మితంబులునై చూపరుల దృష్టికి నమరావతీపురంబున సురాంగనలు వారిచ్చకు వచ్చినయట్లు విచ్చల విడిగా విహారం బొనర్చు విహారారామముల ప్రాకారభిత్తికలా యని భ్రాంతి నాపాదించుచుండు.

అందలి విపణివాటికాప్రదేశంబులు వజ్ర, వైదూర్య, నీల, గోమేధిక, మరకత, మాణిక్య, పుష్యరాగ, మౌక్తిక, ప్రవాళాది ప్రభాభాసురంబులును, ఆమ్ర, కపిత్థ, జంబు, జంబీర, పనస, తినిశ, రంభ, నారికేళ, నారంగ, బహుబీజ, దాడిమ్యామలకాది ఫలసముదాయసహితంబును, ఇందీవర, పుండరీక, కోకనద, మల్లికా, జాజి, చంపకాశోక, నాగ, పున్నాగ, కల్హార, కురువక, కరవీరాదిపుష్పతతియుక్తంబు లగు, నానారత్నఖచిత కేయూర, కంకణ, మౌక్తికదామ, కంఠాభరణ, పాదాంగుళీయక, నాసాభరణ, తాటంకాద్యాభరణవిశేషాన్వితంబులును, నానావిధసుగంధయుక్త పదార్థతైలశోభితంబులునునై యలరారు. వెండియు నప్పట్టణపరిసరంబుల శృంగారారామంబులును, శ్రేష్ఠోదకంబులఁ బ్రవహించు వెల్లువలును, వాని కెలఁకుల నందంద మహీరుహచ్ఛాయల దుర్భరసంసృతిక్లేశంబు త్యజించి తపం బొనర్చు మునిపుంగవులును గన్పట్టుచుందురు. అప్పుటభేదనంబునం గల యమాత్యాగ్రగణ్యు లింగితజ్ఞులు, శస్త్రవిద్యాపారంగతులును, సూనృత ప్రియవచస్కులును, రాజకార్యసంధానధురంధరులును, న్యాయవిచారణా తత్పరులు నగుచు వెలుఁగొందుచుందురు. హాలికు లనృతబద్ధులు గాక సతతము సత్యధురీణులై హాలాయత్తచిత్తులై వసుంధరను దున్నుచుఁ బుష్కలసస్య సంపన్నులై యుందురు. కిరాటు లర్థకాములు గాక దానప్రవణులై శశ్వత్కీర్తి గడించుచు ధనాధిక్యముచే ధనదునిఁ బరిహసించుచు సదాన్యాయానువర్తనులై వర్తించుచుండిరి. తత్పురవాసులు నిత్యానందపరవశులై రేనిసత్పరిపాలనాపటిష్ఠతం గొనియాడుచు నేభయంబు లేక సుఖంబున జీవించుచుండిరి.

అట్టి పురంబును సుధార్మికుం డనురాజు పాలించుచుండె. హరిదశ్వాన్వయాంభోధిపరిపూర్ణసుధాకరుండును సువిశాలయశోవిభాసియు దానతత్పరుండును ప్రజానురంజకుండునై శాత్రవనృపాలురపాలిట శాతశరుండై, మహీతలం బేకచ్ఛత్రముగాఁ బాలించుచుండె. ఇట్లుండ నొక్కనాఁడా భూపాలాగ్రగణ్యుం డంతఃపురంబునకుఁ జని పర్యంక మధిష్ఠించి కరతలంబున వదనంబు నిడుకొని సంతతధారగాఁ గన్నీరు కాల్వలై పాఱ విలపించు పట్టమహిషిం గాంచి, బాష్పధారాపూరితం బైన తద్వదనంబు కరంబునం దుడిచి, దేవీ! యిట్లు చింతాకులస్వాంతవై శోకసదనంబున నలంకారరహితంబుగ నుండఁ గతం బేమి. కొండొక యపరాధం బొనర్చితినేని మదీయప్రమాదంబును దయార్ద్రహృదయవై క్షమియింపుము. భవదీయనిశ్వాసవాయువులు నాహృదయమునకుఁ గంపంబు పుట్టించుచున్నయవి. అశేషరాజ్యలక్ష్మి నీవశంబుఁ జేసెద. నీ విచారంబునకుఁ గతం బేమో వచియింపు మన్నఁ బులకాంకితగాత్రయు నిమీలితనేత్రయు శోకవిఘూర్ణమానసయునై యొక్కింతయైనఁ బ్రత్యుత్తరం బొసంగదయ్యె. అంత నొక్కవృద్ధదూతిక "ఓ నృపకులతిలకమా! మీవలన సుంతైన నేమి ప్రమాదంబు వాటిల్లు? నేఁడు దేవి గట్లురాయనిపట్టి పాదాంబుజంబులు పూజింప నర్ఘ్యపాద్యాదిపూజాద్రవ్యంబులుం గొని జనుచు మధ్యమార్గంబున 'అపుత్రస్య గతి ర్నాస్తి' యను సూక్తిని బౌరాణికముఖంబున నాకర్ణించి గేహంబునకు వచ్చి పరిజను లెంత బతిమాలిన నాహారాదుల నొల్లక యిట్లు విలపించుచున్నది."

రా జాకర్ణకఠోరంబులైన బెట్టిదంపువాక్యంబు లాలించి యమేయనిశ్వాసంబుల నిడుచుచు "దేవీ! అసాధ్యంబులై దైవాధీనంబులగు కార్యంబులకు మన మేమి చేయంగలారము. లేఖులకు మనయం దనుగ్రహము లేదయ్యె.

మన హృదయంగలకుఁ బుత్రగాత్రాలింగనభాగ్యం బప్రాప్తంబయ్యె. మనుజుఁ డెట్టిబీజంబు విత్తునో యట్టిఫలంబును తా ననుభవించును.

ఎవఁడు తాను తొలిపుట్టున నెట్టికర్మల నొనర్చునో యీభవంబున వాఁడు దగినఫలంబునే పొందు. ఎట్టి సత్కులసంజాతుఁ డైనను నెంత సదసద్వివేకములు గలిగియున్నను బ్రాగ్జన్మకర్మఫల మనుభవింపక తీఱదు. మర్త్యులకుఁ గష్టసుఖములుఁ బూర్వభవంబునఁ దా మొనర్చిన కర్మప్రాబల్యముచేతనే సంఘటిల్లు. ఖేదంబులఁ బొమ్మని త్రోచుటకుఁగాని సుఖంబులను రమ్మని కొనితెచ్చుటకుఁగాని మనుజులు సమర్థులు కారు. ప్రాగ్భవదుష్కృతములచే నీజన్మంబున సజ్జనులకైనఁ గడగండ్లు సంభవింపకమానవు. పూర్వభవంబునందలి సుకృతముచే దుర్జనునికైన సౌఖ్యములు గలుగకమానవు. అందుచే బుధు లగువారు కష్టములకు దుఃఖింపక సుఖములకుఁ బొంగిపోక తుల్యమనస్కులై కాలక్షేపము చేయుచుందురు. ఎట్టి ప్రజ్ఞావంతుఁ డైనను, దయ్యంబును వేఱుచేయ సమర్థుఁడా? మర్త్యులకు శక్య మాప్రయత్నంబులం జేయుము. గురుజనంబుల సత్కరించి, భక్తిసంయుక్తురాలవై ప్రణమిల్లుచుఁ జరియింపుము. సురగణంబుల నెక్కుడుగ నారాధింపుము. సంయమీంద్రుల సేవింపుము. అసాధ్యం బైనఁ గోరినవరంబు వారొసంగెదరు. తొల్లి చండకౌశికుని యనుగ్రహమున బృహద్రథుఁడు వివ్వచ్చునైన జయింపఁజాలిన పుత్త్రిరత్నంబునుం బడయలేదా? విద్వద్వందితు లగు తాపసోత్తముల మాహాత్మ్యం బెఱుంగ నేరికిఁ దరము.

“ ఏ నహర్నిశ మిట్లు చింతించుచుంటిని. గర్భశ్రాంత యగు దేవిని నే నెన్నఁడు కన్ను లలర వీక్షించెదనో, తనూభవసంజాత విభవముచే నానందపరవశ మగు నాపరిజనబృంద మెపుడు సంతోషవార్ధి నోలలాడునో, నా దేవి తాను పిశంగవసనధారిణియై సుతు నొడిలో నిడుకొని యెన్నఁడు హర్షాబ్ధిలో నోలలాడునో, సౌరభమిళితతైలము గచములం దలఁది రక్ష కట్టి ఘృతమధుబిందువులు తాలువునం దునిచి భూతిరేఖ ఫాలభాగంబునం దిడి గోరోజనముచేఁ జిత్రితమగు కంఠసూత్రముఁ గట్టి స్వర్ణడోలికలందు సుగంధప్రసవంబు లిడి పీతాంబరములు ధరియింపంజేసి వెలికలఁ బరుండఁబెట్టి చక్కని జోలగీతములఁ బాడుచు మోమునఁ జిఱునగవు

దళుకొత్త నాహృదయమున కెపు డాహ్లాదము పుట్టింపునో; నాపట్టి గోరోజనముచేఁ గపిలమై రాజిల్లువాఁడై నేన నేన యని యంతఃపురకాంత లెత్తుకొనుచుండఁగా మంగళప్రదీప్తములవలె నానేత్రముల శోకాంధకారము నెన్నఁడు పాయునో; కాయకాంతిచే నెప్పు డీసౌధంబున దివ్వెటిలీల విరాజిల్లుచుఁ జెంగుచెంగునఁ బరుగిడునోకదా; సముదంచన్మణిమయ సౌధోపరి భాగంబున నాసీనుండనై నాబిడ్డను మదీయోత్సంగంబుల నిడుకొని యెప్పుడు నాతనివి దీఱ ముద్దులాడుదునో; యెప్పుడు నాతనయుఁడు శస్త్రాస్త్ర విద్యలయం దాఱితేఱి శస్త్రంబులు సవ్యాపసవ్యముల ధరించుకొని స్యందనారూఢుఁడై కాంతారంబునఁ గ్రుమ్మరు శరభభిల్లీలులాయాదుల శౌర్య సముద్రేకంబున వేఁటాడి నిలయంబునకుం జనుచుండ నమందానంద కందళితహృదయారవిందుండనై యెదుర్కొని పుత్త్రగాత్రాలింగనముఁ జేయుభాగ్యము సంభవించునో; సంతోషాతిశయంబున నయనముల నానంద బాష్పములు చిప్పిలుచుండ మణిమయకుట్టిమంబుల మణిప్రతిబింబితచ్ఛాయలఁ దిలకించి నడయాడుచు మఱియొకబాలుం డనుభ్రాంతిచేఁ గ్రీడార్థమాహ్వానించుచు శిలాప్రతిధ్వానంబుల నబ్బాలకుని ప్రతివచనంబు లని యెంచి యానందించి క్రీడించుచుఁ దనరాకకు సంతసించి వేలకొలఁది పృథ్వీశులు కరంబులు సాఁచి గౌరవించుచుండఁగా నిండోలగంబున నాముందఱ గ్రుమ్మరుచుండఁ దిలకింపఁగలనో; మదీయమనోరథంబు లెప్పుడు కొన సాఁగునో; యని పరిపరివిధంబుల నాలో నేనే చింతించి సంతతధారగాఁ బ్రవహించు బాష్పవారిం జేలాంచలంబులచేఁ దుడుచుకొనుచుంటి నని ప్రియాహృదయసంతప్త శోకానలంబు శీతలమృదు మధురవాగమృతధారలఁ జల్లార్ప నెంచి తనప్రేయసిం డాసి వామకరం బామెబాహుదండంబులపై వైచి సమీపంబునకుఁ జేరఁదీసికొని గాఢాలింగనపురస్సరముగా నాసాధ్వి శిరంబు తనవక్షంబున హత్తించి వామకరంబున నయనసలిలంబుఁ దుడుచుచు దక్షిణహస్తంబునఁ జుబుకంబుఁ గొని శిరంబు మూర్కొనుచు ననునయాలాపంబుల నిట్లని మోదార్చె. ప్రాణేశ్వరీ! నీశోకానలంబు ధైర్యాంబువులచేఁ జల్లార్పుము. ధైర్యధనుల కసాధ్యం బెయ్యది లేదుగదా.

సీ. "బుద్ధీంద్రియక్షోభములకుఁ బెట్టనికోట
విపదంబురాశిదుర్వికృతి కోడ
ఖలమరాలాపమార్గణవజ్రకవచంబు
రణమహీస్థలికి శ్రీరామరక్ష
శాత్రవదుర్గర్వసంస్తంభనౌషధి
మొనయుచింతాశ్రేణిమూక విప్పు
యోగాదిసంసిద్ధు లొనఁగూర్చు పెన్నిధి
తూలునేకాకుల తోడునీడ

గీ. సకలగుణప్రధానంబు సకలకార్య
జాలసాఫల్యకరణైకసాధనంబు
ధైర్యగుణము............"

రాజ్ఞీ! ధృతి యవలంబించి శాంతచిత్తంబున నీసౌధాగ్రములందు విహరింపుము. సద్వరప్రసాదులగు కులదేవతల నారాధింపుము. దీనులఁ బోషింపుము. కులదేవతలు నీవాంఛాసిద్ధి నొనర్తురు. శిరీషపుష్పసదృశంబగు నీ నెమ్మేను శోకాతపంబుచే, సంతప్తంబు చేయక భగవదారాధనంబునఁ గార్యసాఫల్యంబు నొందుము. అని కొన్ని మనోవ్యథాశమనోపాయంబులగు వాక్యంబులచే నూఱటం గూర్చి తనప్రాసాదంబునకుం జనియె.

నాఁటనుండియు నద్దేవి శాస్త్రవిహితప్రకారంబున దేవబ్రాహ్మణగురుజనంబుల కత్యంతోపచారములు చేయుచుండె. ఘోరవ్రతంబులఁ జరించుచుండె. పర్వదినములఁ జండికాధామంబునకుం జనుచుండె. ప్రత్యహంబును బ్రాతఃకాలంబు గో తిల కలధౌత సువర్ణంబుల భూసురుల కొసంగుచుండె. వేదపారాయణము చేయించుచుండె. సత్త్వంబుల కాహారం బొసంగుచుండె. కొంతకాలంబునకు హరిభక్తిపరాయణు లగు బ్రాహ్మణోత్తముల యాశీర్వచనంబున గర్భవతి యయ్యె.

---

# ద్వితీయ మంజరి

---

ఇట్లు వ్రతోపవాసాదులు సఫలం బగుడు నొకసుముహూర్తంబున నత్తన్వి యొక్క తనయునిం గనియె. వాఁడు సౌభాగ్యలక్షణసంపన్నుండును, తేజోవిరాజమానుండును, జంద్రకందర్ప సదృశరూపకలా విలాసభాసురుం డును, షోడశకలాపరిపూర్ణుండును నగుచు నుడుపతిం బరిహసింపఁ జాలిన ముఖకమలంబును, వెడదయైన లలాటంబును, దీర్ఘంబులైన బాహువులును, శతపత్రంబులఁ బోలు నేత్రయుగ్మంబునుఁ గల్గి మారుని మారాడఁజాలి శుక్ల పక్షశశధరుఁబోలె దినదినాభివృద్ధి నొందుచుండె. దైవజ్ఞులు జననకాలం బును బరీక్షించి జ్యోతిశ్శాస్త్రసూత్రములఁ బరిశీలించి గ్రహయోగప్రాబల్యం బుచే సర్వమహీమండలం బేలఁగలవాఁడు. ఐన నేమి మూలానక్షత్రసంజని తుం డగుటచే మాతృపితృహీనుం డయి యిబ్బాలకుండు బాల్యంబునఁ గడు సంకటంబుల నందు నని తలఁచి రాజున కావార్తఁ జెప్పంజాలక దోషం బునుఁ గప్పిపుచ్చి గుణంబులు మాత్రము పేర్కొనిరి. ఇట్లుండఁ గొంత కాలంబునకు వైరికువలయేశ్వరుఁ డారాజ్యం బపహరింప నెంచి గజతురగ స్యందనపదాతులను దోడ్కొని రణభేరి మ్రోయించె. భటనికాయం బులు గుణంబులు సారించి వీరహుంకారనిస్వనంబులు మిన్ను ముట్ట సింహ నాదంబులు చేయుచుఁ బురంబును సమీపించి నిశాసమయంబున నప్పట్ట ణంబుపైఁ బడ నెంచి తఱి వేచి యుండె.

అంత తపనుం డపరవారాశిం జేరుటఁ గాంచి రజనీతరుణి యుత్కం ఠానందాబ్ధి నోలాడి నీరదాళింబోలు తదీయకుంతలజాలంబులు దీర్చుచున్న ట్లంధకారంబు జగం బలమికొనియె. నిశాతరుణి తనపతి యగుకైరవమిత్రుని

యాగమంబు నిరీక్షించుచుఁ దననీలచికురంబులఁ జేర్చిన ప్రసూనంబులఁబోలె సితోడువులు నాకాశరంగస్థలం బలంకరించె.

క్షపాహైవాహికసమయ మహోత్సవపురస్కృతుండై హిమభానుండు దిక్తటశతాంగం బధిష్ఠించి ప్రాఙ్మహీధరంబుపైఁ దోఁచె. అంతఁ గైరవకుడుంగములు ప్రిదిలె. అబ్జకుడుంగములు ముకుళితంబు లయ్యె. చక్రవాకంబులు శ్రుతిహితభాషితంబులఁ జేయఁదొడంగె. మార్తాండతీక్ష్ణత కోర్వం జాలక దరీభాగంబునఁ బరుండి హరిదశ్వుం డపరాంభోనిధిలో నస్తమించుటం గని చలువలు వెదచల్లు సాంద్రచంద్రికలు విహరింప నిచ్చ జనించి వినిద్రాణములై చకోరము ల్వెడలె. ఇట్టిసమయంబున రాజధానీనగరం బాబాలగోపాలంబును సుషుప్త్యవస్థ నుండె. అదను నిరీక్షించి ప్రాకారబహిర్భాగంబుఁ జేరి విడుదులు నెలకొల్పుకొని యాయుధంబుల సవరించి యగ్నియంత్రంబుల సజ్జీకృతం బొనర్చి యుద్ధసన్నద్ధులై భేరి మ్రోయించిరి. తద్ధ్వని నాకర్ణించి కేరళనాథుం డులిక్కిపడి దిగ్గున లేచి ప్రాకారబాహ్యప్రదేశంబునఁ గరదీపికాసహస్రకాంతుల సాహాయ్యంబున సజ్జీకృతులౌ పరిపంథిసమూహంబుల నీక్షించి, యమాత్యసేనావర్గంబుల రావించి వారలఁ గలయ నవలోకించి, యిట్లని చెప్పఁదొడంగె.

"ఓ వీరాగ్రేసరులారా! ప్రపంచములో తృష్ణలు గలవు. కాని వానిలోఁ గుటిలము గలదు. రణస్థలియందు శాశ్వత మగు కీర్తి నార్జించుతృష్ణ యద్వితీయమైనది. పగతుని ముఖాముఖిగా మార్కొని ఖడ్గంబు ఝుళిపించి దూసిన విచ్చుకత్తి క్షాత్రసంహార మగువఱకు నోఱఁ జేర్చక యెదుర్కొని బలప్రతాపములు మిన్ను ముట్ట రుధిరధారలు చిందించి తనివిఁ దీర్చుకొనుటే వీరలక్షణము. అదియే యసమానాద్వితీయ మగు యశోవాంఛ. మీరు శాత్రవచయముల నెదుర్కొని శూరప్రతాపములు వెలువరించి, యష్టదిక్పాలురకు సైతము గుండె లవిసిపోవఁ బ్రాణికోటి యెల్లను దమముక్కుపై వ్రేలిడి బహిర్గతమొనర్పఁ దగినస్థలము రణరంగము. వసుంధరను భేదించునపుడు వివిధోపల

ములు వెలువడుచుండును. అందమూల్యరత్నంబులును, నిరర్థకశిలలును, నసంఖ్యాతములుగాఁ గలవు.

శాణముపై వాని నునిచి సానఁబట్ట రత్నశ్రేష్ఠములు వెలువడుకరణి సమరస్థలి యనుశాణముపైఁ బురుషరత్నములు వెలువడి దిగ్విజయులై ప్రకాశించెడిది రణక్షేత్రము. రణస్థలి యను నందనారామంబున విజయలక్ష్మీకుసుమ గుచ్ఛాంతర్గత యశోమకరందపానలాలసులై వీరభ్రమర సంచయము శౌర్యాలాపఝుంకారముఁ జేయుచు రణవిహార మొనర్చుచుండు. మీరలు నిండారువేడ్కతోఁ జెలగుచుచుండుఁడి. యుద్ధమే శౌర్యప్రతాపములకు మూలము. అదియే సౌఖ్యశ్రీల కాటపట్టు. అదియే శూరాగ్రేసరక్రీడారంగము. అదియే కైవల్యసౌధారోహణ సోపానము. మధ్యందిన చండమార్తాండతేజోవిరాజమానులై వైరిసేనామధ్యమున వీరవిక్రమవిహార మొనర్పుఁడు. మీయశశ్చంద్రికల నలుదిక్కుల వ్యాపింపఁజేయుఁడి. శౌర్యధనులారా! లెండు. సంసిద్ధులు గండు. మీ యాత్మగౌరవములను గులగౌరవములను నిలుపుకొనుఁడు. శీఘ్రమునఁ బునర్దర్శన మగుఁగాత. ధైర్యమును వహింపుఁడు. శత్రువులను నుఱుమాడుఁడు. యుద్ధమున గెలుపొందువానికి నైహికరాజ్యలక్ష్మీసుఖంబులు చేకూరు. మృతుఁడే యైన నాముష్మికరాజ్యరమాలలామబాహుపరీరంభసౌఖ్యంబు కరతలామలకం బగు. కావున ధైర్యం బవలంబింపుఁడి. తనువు శాశ్వతంబు గాదు. కీర్తియే స్థిరమైనది. కావున ముందంజ వైచి శాత్రవుల నుగ్గాడి కేరళదేశగౌరవము నిలుపుకొనుఁడు. తొల్లి సుధాహరణార్థమై నాకంబున కరుగునప్పుడు పతగేంద్రునకుఁ దల్లి యిచ్చిన యాశీర్వాదంబులే మిమ్ము రక్షించుఁగాత. పితృవాక్పరిపాలనార్థమై దండకారణ్యముల కరుగు రఘువరునికి దశరథుం డొసఁగిన పరమదీవనలే మీకుఁ దోడై యుండుఁగాత."

ఆహా! ఈగంభీరధీరవాక్యంబు లెట్టిపందల నైన శౌర్యోజ్జ్వలులుగఁ జేసి భండనోన్ముఖులఁగాఁ జేయుఁగదా. ఆరాజునోటనుండి వెలువడు

నొక్కొక యక్షరమునకును నావీరచూడామణులమేనులఁ బులక లుద్భవించెను. చిత్తము సంగరోద్రేకంబున హత్తుకొనియుండె. పంచకట్టులు బిగయఁ గట్టి ఖడ్గముల నొఱలనుండి దూసిరి. ఆహవంబునకు నే నరుగుదును. నే నరుగుదు నని యోధులు పలుకఁజొచ్చిరి. అంతఁ బ్రభాతం బయ్యె. ఇరుపార్శ్వములవారు సంగరమునఁ బ్రవేశించిరి.

కృపాణంబులు ఝుళిపించిరి. రథనేమిధ్వానంబులు మిన్ను ముట్ట నరుణారవిందజైత్రంబులై నేత్రప్రసారంబులు దిశలఁ బర్వ లయకాలయమభటహుంకారశంకాకరం బైన శింజినీటంకారంబులు దిశాభాగంబుల భేదింప రౌద్రరసపూరితగాత్రులై వీరవరులు వీరావేశఘోరాటోపదీపితాంతరంగతరంగితక్రోధాంకురంబులు మొలక లెత్తి ప్రజ్వరిల్లి యుప్పరంబున కెగసి మహాటవుల భగ్నం బొనర్చు కార్చిచ్చుచందంబున, విజృంభించి ప్రళయకాలకంఠీరవంబు క్రొవ్వాడిమెఱుంగుమాపు లనియెడు కరరుహంబులచే భద్రగజకుంభస్థలంబుల వ్రక్కలించుకైవడిఁ ద్రిపురంబులపయిం గడంగు ననలాక్షునిభంగి, ననర్గళప్రభావంబువహించి, శిఖిశిఖాసంకాశశాతశిలీముఖనారాచప్రముఖంబు లైన వివిధనిశితసాయకపరంపరలు గురిపింప, విధ్వస్తఘోటకంబులును, విస్ఫోటిత భటాంగంబులును, వికీర్ణరథంబులును, వినిహతపదాతివ్రాతంబులును, విభ్రష్టద్విరద సంఘంబులును, నగుచు రణరంగంబు భయంకరాకృతిం దాల్చె. తత్సమయంబున గజాశ్వబహుళరింఖాసముద్ధూతధారుణీపరాగం బంబరంబున కెగయ, నశేషతురంగహేషాపటహానిస్స్వన కరేణుఘీంకార రథనేమి పటపటాత్కార శూరహుంకార శింజినీటంకార భటపరస్పరధిక్కారనినద విశీర్యమాణ శ్రోత్రపుటంబుగ రాజసమూహంబులు భయంకరభంగి నాహవం బొనర్చిరి.

తుష్టుఁడను తట్టుముట్టాఁకు రిపువర్గంబు లిరుపార్శ్వముల నత్తమిల్లిరి. సైన్యఖడ్గధాటి కోర్వంజాలక కొందఱు పలాయితు లయిరి. కొందఱు స్మృతి తప్పి భూతలంబున వ్రాలిరి. అంత నొక్కశత్రువీరశిఖామణికరముక్త

నిశితచంద్రహాసధారాప్రహారం బుదరోపరిభాగంబునం బడి కేరళదేశాధీశుఁడు వీరస్వర్గ మలంకరించె. శాత్రవభూధవు లత్యంతక్రోధచిత్తులై దేశంబు వశంబుగాఁ గైకొని విహితప్రకారంబున స్వస్థానంబునకుం జనిరి. అంతఁ బట్టంపురాణి భూభర్త సమరంబున సమసిపోయె నని కర్ణకఠోరంబుగా నాలించి యక్కలకంఠకంఠి కంఠీరవగర్జనంబు వినినకరేణుచందంబున హృదయంబు వ్రక్కలై వక్షంబును గరతలంబులచే మోదుకొనుచుఁ బ్రాసాదాగ్రంబునకుం జని ధారుణిఁ గూల ఖండితంబు లైనకటకంబులును, విభ్రష్టం బైనధమ్మిల్లంబునుఁ గల్గి దుఃఖాక్రాంతయై "అంగనలకుఁ బతులు లేని యీలోకభోగంబులును, నీచక్కందనంబులును రోదసీగహ్వరమునకుఁ బెట్టిన దీపకళికవంటివి. నాఁతులకు బాల్యంబున జననీజనకాదులయొద్దను, దారుణ్యమందు భర్తలయొద్దను, వార్ధక్యమున సుతులయండ నుండుటే పరమధర్మము గాని స్వాతంత్ర్యంబుతో మెలఁగుట పాడి గా దని తొలి చదువు లుద్ఘోషించుచున్నయవి.

సుతుఁడా, శైశవావస్థయం దుండె. ఇఁక నేరిపంచకుఁ జేరి నీచ జీవనంబునకుఁ బాల్పడుదాన. పువ్వు లమ్మినయూరనే కట్టెల నమ్మట యెట్లు. అదియునుగాక సతికి భర్త్రనుగమనమును మించినధర్మము లేదు గదా! కావున భర్తృదేహంబుతోడ నగ్నిప్రవేశ మొనర్తును" అని దాదులం డాయం జేరి భక్తినిబద్ధాంజలియై,

"అమ్మలారా! ఈ ముద్దులపాపసుందరాకారము వీక్షించి నాజీవితమందు సకలకష్టములను మఱచితి. ఐహికజీవితసమాయాతశోకంబు లెవ్వియు నన్నంటి యెఱుంగవు. ఈ కుమారరత్నవదనం బీక్షింప నానందభావము హృదయంబున నంకురింపక మానదు. కాన నీనాఁటనుండి మీ రీనాట నున్నంతకాలము కరుణారసపూరితహృదయలై మాతాపితృవిహీనునిముఖకమలం బుపలక్షింపఁ గఠోరహృదయులకు సైతము జాలిఁ గలిగించువానిని, భగవత్స్వరూపలక్షణంబులు గలవానిని, కపోలతటంబులపై దోఁచునమాయ

కత్వంబు గల్గు నీనానిసుఁగును భవత్పుత్త్రిరత్నంబుగా భావించి కాపా డుఁడి. స్నానంబులు లేక దేహంబు కంపూతిమయముగా నాపట్టి లోకు లచే హేయముగాఁ జూడఁబడునో, దిక్కులేని శాబకుం డని లోకులు కాకులై నాబిడ్డ నెంత తేలికగాఁ జూతురో, మామమామ సాక్షిగా నీము ద్దులపాపని గారాబముతోఁ బెంచుచు వేళ కింత యోదనం బొసంగుచు దోషంబులపాలికిం బోనీక రాజోచితం బగు సంధివిగ్రహయానాసనద్వైధీ భావసమాశ్రయంబు లనియెడి షడ్గుణంబులఁ బ్రవీణునిగా నొనర్చి చతురు పాయంబులఁ జాకచక్యంబుఁ గల్గినవానిం గావించి కౌమారంబు గడచను నంతకు నరికుంభికుంభముక్తాఫలంబుల రాల్చి యశోలక్ష్మీకరగ్రహణం బొనర్చి రాజ్యరమామనోహరుం డగునంతవఱకుఁ దోడునీడలై సంరక్షించుం" డని దీనాలాపపురస్సరంబుగాఁ దన తనయుని వారిహస్తంబుల నునిచి నిష్క ల్మషహృదయంబున స్వాహావల్లభుని ధ్యానించి చితియందు భర్తతో నేక కాలంబున నాహుతి యయ్యె.

ఆహా! చదువరులారా! కాంచితిరే, భరతఖండంబునం దుద్భవించిన వీరపత్నులవీరధర్మము. ప్రాణంబుల నైన వీడి మానంబు రక్షించుకొనఁ బతితో నేకకాలంబునఁ జితియం దుపవిష్ట యయ్యె.

ఇట్లు మాతాపితృవిహీనుండును సర్వసామ్రాజ్యసౌభాగ్యభ్రష్టుం డైన యబ్బాలకోత్తమునిఁ గొందఱు దూతికలు కరుణాయత్తలై కుంతలపురం బునకుం జని సామాన్యబాలకసముచితవేషంబున నుంచి మిగుల గారాబమున సాఁకుచుండిరి. అదృష్టహీనున కర్థవంతు లగు బాంధవు లెందఱు గల్గియున్నను నిజాదృష్టముఁ బాపలే రన్నట్లు, తలిదండ్రులు సమసి దాసీహస్తగతుం డగు నబ్బాలకునకుఁ గష్టములు తప్పినవికాక, తుదకు దూతికాజనంబులు గూడ వాని నీలోకంబున వదలి నాకలోకనివాసంబునకుఁ జనిరి.

ఏరాజాధిరాజు మధ్యందినమార్తాండు నాత్మీయప్రతాపప్రభలచే రహిఁ దప్పించెనో, యేనృపతి జగద్విఖ్యాతిఁ గాంచి భరతఖండం బేకచ్ఛత్రంబుగాఁ

బాలించి కీర్తి నార్జించెనో, యేభూజాని వందిమాగధగాయకజనంబులచేఁ బొగడ్తల నందెనో, యేనృపకులతిలకము విద్వద్వందితులచే శ్లాఘింపఁబడి యెనో, యేక్ష్మానాథునిరాజ్యంబున నీరేడులోకంబులకుఁ జేయూఁతయై లక్ష్మి పెంపొందెనో, అట్టి రాజపుంగవుని తనూభవుండు భిక్షాపాత్రంబుఁ గొని వాడవాడలఁ ద్రిమ్మరి నేఁటికిఁ గబళంబు లాసించుచుండె. ఎన్నెన్ని సంస్థానంబు లగణితమహాసామ్రాజ్యంబులు కాలగర్భంబునఁ బడి మాయ మైపోయినవి. పోనిమ్ము. మీపూర్వు లొకప్పుడు మహావైభవముతో సకల సంపత్పరంపరలచే నలరారి రనుమాట యాంధ్రజనహృదయములందుఁ గల కాలము స్మరణీయ మగుఁగాత. కాలమహిమ యనిర్వచనీయముగదా. కట కటా! అంధకారబంధురం బైనలోకమాయ దాఁట దైవసములకుఁగూడా నసాధ్యంబుగదా!

నాఁటినుండియు నావీటిసుదతు లాసుకుమారబాలకుని నెమ్మనములఁ దమబిడ్డగా భావించుచు మిగుల జాగరూకతతోఁ బోషింపఁ దొడఁగిరి.

ఆపురిభామినుల నొక్క యలినీలాలక హితంబుగా మితంబున నాహారం బొసంగు నొక్కసీమంతిని కడు నభిమతంబున జలకంబు లార్చు నొక్క యరాళకుంతల వాని కటితటంబున పసిండితెఱంగుల యొల్లె గట్టు చుండె. మఱియొక్క యోషారత్నంబు కడుఁ జాలివడి వీడినకచంబులఁ జక్కదువ్వి సిగముడి వైచుచుండె. వేరొక్క భామామణి గాత్రాలింగన కుతూహలచిత్తయై కరంబునుఁ బట్టుకొని ముద్దిడుచుండె. తత్పురవాసు లెల్లరు ప్రమోదభరితమానసులై యబ్బాలకునకుఁ దమ బిడ్డలతోడ నుపాయ నంబు లొసంగుచు విద్యాబుద్ధులఁ గఱపుచుండిరి.

ఇట్లుండ నబ్బాలకుఁ డొకనాఁడు నిరుపమానరూపలావణ్యాతిశయం బునఁ దోడిబాలుర మించుచు నందంద తప్పటడుగు లిడుచు నజ్ఞానభాషితంబు లగు ముద్దుఁబలుకు లుచ్చరించుచుఁ దోడిబాలురం గూడి కొంతలనాథునిఁ బ్రధానామాత్యుండగు దుష్టబుద్ధిసదనంబున కేఁగె. ఆప్రధాని సకలశాస్త్ర

పారంగతుండైనను, పయోముఖవిషకుంభసదృశుండును, నాత్మలాభపరా యణుండును, నగు నాదుర్మంత్రి తత్సమయంబునఁ గొందఱు మునిపుంగవులతో నెద్దియో ప్రసంగించుచుండె. ఆమ్మునిశ్రేష్ఠులు నబ్బాలకుని వీక్షించి యాతనిముఖకమలంబునఁ బ్రస్ఫుటితంబులగు సర్వశుభలక్షణంబుల నుపలక్షించి ప్రసంగవశంబున నయ్యర్భకుండు సర్వమహీమండలం బేలఁగలఁ డని వచియించిరి. ఈర్ష్యాసూయాపరుం డగు నాదుష్టబుద్ధి శ్రవణపుటంబుల కావాక్యంబులు నిశాతశూలప్రహారసన్నిభంబులై వేధింపఁజొచ్చినను, తదంతఃకరణదందహ్యమానం బగు నసూయ నాత్మఁ గప్పిపుచ్చి మందస్మితంబు నభినయించుచుఁ దత్కాలోచిత సమ్మానసల్లాపంబులచే నమ్మునివరిష్ఠుల వీడ్కొలిపె. తదనంతరంబున నయ్యమాత్యపుంగవుండు తన యాలోచనా మందిరంబున కరిగి యేకాంతంబున నుపవిష్టుండై తత్సంయమీంద్రులు వచించిన భవిష్యత్సూచకవచనంబులు తనకర్ణపుటంబుల మాఱుమ్రోఁగుచు డెందంబు నాందోళనపఱచుచుండ నాత్మగతంబున నిట్లు వితర్కింపఁ దొడంగె. "మాతాపితృరక్షణశూన్యుండై బ్రాహ్మణగృహంబుల భిక్షుకవృత్తిచే జీవించునిబ్బాలకుం డెవ్వండై యుండునో? తల్లలాటశుభలక్షణంబుల వీక్షింప నొక్కొక్కప్పుడు నాకు నిట్టిసందేహంబు తోఁచుచుండెడిని. వానియదృష్టం బట్టిదిగ నమ్మునులు వచియించిరి. అది సత్యం బయియుండు నొకో? అగునేని నాయాశయం బెట్లు నెగ్గఁగలదు. పుత్త్రహీనుండను మదీయప్రభువతంసానంతరం బస్మత్పుత్త్రుని నాస్థానంబున నిల్పనెంచు మదీయయత్నంబు లన్నియు వమ్మగునే? కాదు కాదు. ఇది వట్టికల్ల. సర్వరాజ్యతంత్రరహస్యకోవిదుం డగుదుష్టబుద్ధిశరీరంబునఁ బ్రాణంబు లుండ నట్టిది పొసఁగనేరదు. చతుర్ముఖలిఖితంబుల క్షాళనం బొనర్ప సమర్థంబులగు మదీయామాత్యతంత్రంబులఁ బ్రయోగించి ఋషులవాక్యంబులు పొల్లు గావింపనేని నీయమాత్యపదం బధిష్ఠింప నే నదర్హుండ నగుదుగాక" అని పరిపరివిధంబుల నాందోళనాపరంపరలచే దోధూయమాన మానసుండై గతాగత కారియౌ నుయ్యేలఁ బోలు మనంబు నొకింత దిటవు

పట్టుకొని గృహాభిముఖుం డయ్యె. అనంతరంబునఁ హెచ్చుపెరిగిన మచ్చరంబునఁ జంచలితగాత్రుం డై యేకాంతంబున నుండి, చండాలురఁ గొందఱ రావించి వారినాయకుం గాంచి తనమందిరప్రాంగణప్రదేశంబున నడయాడు చంద్రహాసుం జూపి "నేఁ డీయర్భకుండు మదీయమందిరంబునకు రాఁగా జ్యోతిశ్శాస్త్రపారంగతులైన కొందఱు మానిపుంగవు లీబాలకుని ముఖారవిందలక్షణంబు లుపలక్షించి యీఁ డపారవారపర్యంతభూవలయం బేకచ్ఛత్రంబుగా పెద్దకాలం బేలఁగలం డని నుడివిరి. తత్సమయంబునుండి క్షుత్పిపాసావిసర్జితుండనై విచారగ్రస్తుండనై కొండొక తెఱ వెఱింగితి. కాన నీ కొండికవానిం దోడ్కొని నిర్మానుష్యం బంధకారబంధురంబై యొప్పు ఘోరాటవీమధ్యంబున విఖండితకంధరుంగాఁ జేసి రం" డని పనిచె. అంత సంతతరుధిరపానపిపాసాయత్తచిత్తు లగు నాచండాలురు సురాపానమదోన్మత్తులై నిశితసాయకసవ్యాపసవ్యమండలధారులును, కాలపాశసదృశనాగపాశధరులును, సమవర్తిపరిజనతుల్య కర్కశదేహులును, దీర్ఘదంష్ట్రాంకురయుక్తవదనగహ్వరులును నగుచు 'శపింపుఁడు వధింపుఁడు భుజింపుఁ' డని బహువిధంబులఁ బ్రేలుచుఁ బెరిఁగినగర్వంబునఁ జెంగుచెంగునఁ జిందులాడుచు నిశాతనారాచపరంపరలు ప్రక్కలకు నిగిడించి కళావిహీనవదనగాత్రుండైన యారాకొమరుని కర్కశంబులను రజ్జువుల బంధించి పయనంబునకు సమకట్టి మెల్ల మెల్లన నడువఁజొచ్చిరి.

పోవంబోవ నొక్క దంతురితకాంతారంబున పుష్పపరాగాస్వాదనలాలసులై కడురయంబున నరుగు భ్రమరఝుంకారసంకులంబులును, అభ్యర్ణాందోళితఘోరాకారహర్యక్షగర్జనారావంబులును, పాదపశిఖరాకంపనకిరకిరనిస్స్వనస్ఫుటాయమానంబులగు మాతంగకలభఘీంకారంబులును, నికుంజపుంజదరీగర్భంబులు మాఱుసెలంగ ఘుణిల్లుమని తీండ్రించు కోదమక్రొవ్వులితండంబులనినాదంబులును, పులినశ్రేణులపై గోరాడు భూదారవ్రాతఘుర్ఘురారావంబులును, శరభసైరిభభయధ్వానంబులును భయంకరగవయగండకభీషణ

ఘోషంబుల నాలించుచు యాబమగు లరుగుచుండిరి. కాని యమ్ముద్దుల రాహూన గ్రాసంబు లేనివాఁ డగుట నడువలేక సుడివడి కాళ్లాడక సాల భంజికకరణి నిశ్చేష్టుఁడై యుండఁ గోపోద్రేకంబున చపేట లిడుచు నక్కాలకింకరాధము లింతైన కరుణారసపూరితస్వాంతులు గాక చుంచు నిబద్ధహస్తులై యీడ్చుచుఁ గొంతవడికి నొక్కవసుంధరాధరశిఖరాగ్రమునకుం జని యొక్కశృంగారైందవపాషాణనిర్మితంబైన వితర్ది విష్టరంబుగాఁ జేసి యం దధిష్ఠించిరి.

అంత నాచండాలురు కఠినచిత్తుఁడైన దుష్టబుద్ధియాజ్ఞఁ దలంచి చింతించుచు, "సకల నరవరకోటీరఘటితమణిప్రకరాలంకృతచరణ యుగళుండై యుండవలసిన భాగ్యరేఖ యీతనిలలాటమందు లిఖియింపఁబడియున్నది. ఈతని వధించుటకు హస్తంబు లాడవుగదా? ఆహా విధికృత మే మందుము. ప్రభాజితహేళి యగు నీకుమారమాళి వధించు టెట్లు? రూపరేఖావిలాసంబుల కంతుజయంతులను, పంచముఖషణ్ముఖప్రముఖుల శౌర్యతేజంబు ననుఁ దిరస్కరించుచున్నవాఁడు. ఈతనిఁ గన్నతలిదండ్రులనామంబులచే నేయకుర గాజంబులుఁ బవిత్ర మగుచున్నవోగదా." అని యిట్లు పెక్కుభంగుల న్వగచి 'వారిజాక్షులందు వైవాహికములందుఁ బ్రాణవిత్తమానభంగమందు బొంకినను మనుజుండు దురితౌఘంబులచే ముట్టడింపఁబడఁడు' అని శాస్త్రోక్తు లున్నయవి. మన మీతని రక్షించిన నేమి. హైయంగవీనంబును సూపాపూపధేనుదుగ్ధదధిఘృతాదులతోడ సుప్రసన్నంబులగు నోగిరంబుల నాహారించుచు మదాంధులై ధర్మంబు తెలవు గానక సకలసంపదలకు లోనై బొక్కసంబుఁ గరుగఁ దినుచు నుండుభూపతులకొలువునం దుండి దుర్మార్గములకు లోనై వర్తిలుటకంటె నొక కాంతారంబునం జొచ్చి యెలుఁగుపులుఁగులపాతం బడుట మే లని తోఁచెడిని. సకలపాపాకరం బగు సేవకవృత్తిఁ జేయుచు రాజగృహంబుల వర్తించుటకంటె వ్యారిచిత్తవృత్తి నెటింగి స్వఘోషణులై స్వచ్ఛందవృత్తితో మెలఁగుటప్రతిభాశాలురకుఁ బాడి. ఉద్యోగికి దూర

భూమియు విద్వాంసునకు విదేశమును బ్రియవాదికి శాత్రవులును లేరను సామ్యంబు నిజంబేకదా.

భూవలయంబున మనుజుండు కీర్తి నార్జింపవలయు నన్న పెక్కు భంగులు కలవు. విశ్రాణనతత్పరుండై యొకఁడు యశము గడించును. ఆర్త త్రాణ పరాయణుం డని యొకఁడు కీర్తి నార్జించును. దేశోద్ధరణమునకై నిజదారపుత్త్రాదులఁ ద్యజించి దివారాత్రములు పాటుపడి యొకఁడు పేరు సంపాదించును. స్వామికార్యనిర్వహణమం దసమానప్రజ్ఞావంతుఁ డని యొకఁడు వినుతిఁ గాంచును. బవరంబున శోణితధారలఁ జిందించుచు నద్వితీయ శౌర్యప్రతాపాస్నులు వెలువరించుచుఁ బోరి యొకం డప్రమేయమైన ప్రతిష్ఠ నార్జించును. స్వాభిమానము దేశభక్తి మున్నగు సుగుణకలాపంబులచే నెల్లవారును తదీయ శేముషీచాకచక్యమును హృదయఫలకమందు లిఖియించి మాటిమాటికిఁ దలంచుకొనునట్లొక్కరుఁడు విరాజిల్లుచుఁ బ్రవర్తించును. జననీజనకుల నడవడులను బట్టియు గుణంబులఁ బట్టియు నాచారధర్మంబులఁ బట్టియు బిడ్డలకు సుగుణదుర్గుణంబు లలవడుచున్నవి. తలిదండ్రులు తనూభవుని ధృతిసంపన్నునిగను, సనాతన ధర్మపరాయణునిగను రాజభక్తిపరిపూరిత హృదయునిగను, దేశోద్ధారకునిగను వీరచూడామణిగను దాన ధౌరేయునిగను జేయవలయు నన్నచో, బాల్యావస్థయందే వానికి దిగంతవిశ్రాంత విఖ్యాతి వహించిన పుణ్యపురుషుల జీవితచారిత్రంబులు నుడువుచు నని ర్వచనీయమైన యీ మహాపురుషపుంగవుల ధైర్యగుణంబులను బీజంబుల వానిహృదయక్షేత్రంబున విత్తి ప్రభవింపఁజేయవలయును. బలపరాక్రమ శౌర్యవిరాజితులఁ జేయుట తలిదండ్రులకు విధ్యుక్తధర్మమై యున్నది. తల్లిదండ్రులు ధర్మపరాయణులైనను గొందఱు వారిబాస నెగ్గాడి స్వేచ్ఛాధీనులై వర్తించుట లేదా! అని మనకు సంశయాంశ ముద్భవింపక మానదు.

అట్టిదిగూడఁ బ్రపంచమందు జరుగుట సహజధర్మమే. తద్విషయ మునకు బాల్యావస్థయందుఁ దలిదండ్రులు తగినశ్రద్ధ వహింపకుందురేు. మన పురాణములయం దెందఱో శూరులును సుగుణోపేతులును మహోదారులును నగుపురుషోత్తములు తమ వీరజీవితములు లోకంబున కాదర్శములుగాఁ జేసి సముద్రగర్భమున రత్నరాజములఁ బోలి విరాజిల్లుచున్నవారు. ఒక్కొక్క మహావీరునిచరిత్ర మాలించుచో మేనులఁ బులక లుద్భవింపకమానవు; అనిర్వచనీయమైన యనూననూత్నశక్తి వొడమకమానదు. ఇకార్కరణము చేతనే గట్టువిల్తుఁడు జగన్మాత యగు దాక్షాయణితో నొకానొకతఱి, యోధులయొక్కయు ధర్మచారిత్రుల యొక్కయు విజితేంద్రియుల యొక్కయు మహోత్తమచరిత్రులయొక్కయు శీర్షంబుల నాకంఠమునందు ధరింతు నని వాక్రుచ్చె. మనమూలపురుషులు సత్కులసంజాతులు గాకుండు టచే విద్యాసుగంధ మాఘ్రాణించుటకు నసమర్థులై చండాలు రనిపించు కొనుచుఁ బురబాహ్యప్రదేశవాసు లగుటను, మనము తొలిజన్మంబున నెన్నియో యఘంబులఁ జేసి వాని నొడిగట్టుకొని యుండుట నీజన్మంబున నిట్లు నరహత్యకుఁ బాల్పడితిమి. మన మికార్యంబుఁ జేయుట పరాత్ప రుఁడు దివ్యదృష్టితో వీక్షించుచునే యున్నవాఁడు.

ఆద్యంతరహితుఁడు అగోచరుఁడు కారణకారణము సర్వస్రష్ట సర్వశక్తుఁడు సర్వోత్కృష్టుఁడు భగవానుఁ డొక్కఁడే. కరుణాసము ద్రుఁడు. ఆతనిసృష్టివైచిత్ర్యనైగనిగ్యం బెన్న నేరికి తరము ? ఆకాశమును భూమిని సాగరమును సృష్టించె. జలచరఖచర భూచరాదుల సంకల్పించి వాటివాటికి తగిన ఆహారనివాసాదులఁ గల్పించె. తన దివ్యస్వరూప మునకు మాఱుగ నాకాశరంగస్థలంబున శాశ్వతంబుగా దేదీప్యమానంబుగ విరాజిల్లు చంద్రతారార్కులను సృష్టించెను.

అపారపారావారమును బంధించినవాఁడు, ఝంఝానిలంబును నరి కట్టినవాఁడును నాయనయే. సమస్తజీవరాసులను పుట్టించువాఁడు, గిట్టించు

వాఁడును నాయనయే. అస్మద్భవిష్యద్రహస్యంబు లాయనదివ్యదృష్టికి బట్టబయలుగా నుండును. ఆమహాత్ముని దూరదృష్టికిఁ దెలియకయే సుంతైనను తటాలున జరుగున దేదియు నుండదు. పరాత్పరుని యుద్బోధము లతిగూఢములు. ఆయనవిజ్ఞానప్రభావము లిట్టి వని వివేకింపఁ జాలము. ఆయన శాసనంబు లతి భయంకరములు. ఆమహాత్ముని యుపదేశములు మహారహస్యము లైనవి. వ్యోమతలంబు లీక్షించిన ఆయనప్రకాశము బొడగట్టును. విశ్వమువంక వీక్షించిన పరంధామునిదయ దయివాఱుచుండును. మనుష్యమాత్రుల మైనమనలను ఇతరజీవరాసులనుండి విభాగించి వానికంటె నధికదశయం దుంచినాఁడు. సర్వేశ్వరుఁడు మనకు సమస్తావయవము లొసంగియున్నాఁడు. సౌగంధ్యంబు నాఘ్రాణించుటకు నాసికను, మధురుచుల భేదాభేదంబులఁ గనుంగొన జిహ్వయును, మధురంపువాక్కు లుచ్చరించుటకు నోరును, తనసృష్టివైపరీత్యంబులఁ గనుంగొని యానందించుటకు నయనంబులును, పరాత్పరునికి ప్రీతికరంబులైన క్రియ లొనర్చి తన్ను మెప్పించుటకు కాళ్లు చేతులను నియమించె. నరహత్య వ్యభిచారము దొంగతనము మొదలగు దుష్కార్యంబు లొనర్చి పెద్దల కవిధేయులై ప్రవర్తించుట ధర్మంబు గా దని విద్వజ్జనంబులు వక్కాణించుచున్నవారలు. అట్టిచో పరమేశ్వరునికి ఇష్టంబులైన సత్కార్యంబు లాచరించి భక్తిసంయుక్తులమై మెలంగిన లోకంబుఁ బూజింపఁబడఁదగుదుము. భూతలంబున జననీజనకాదులు లేక ప్రాణేశ్వరులు లేక పలువిధములైనబాధలు పడువారు, బిడ్డలు సితంతువులు వృద్ధులు నాదిగాఁగలవారు, ధరింప వలువలు లేక, నివసింప నిలయంబులు లేక, ప్రచండమృగతుష్ణవార్ధులఁ గ్రుమ్మరుచు చలిబాధకు వణఁకుచు కన్నీ రొలుకుచు మనసాయమున కర్థించునపుడు చేదోడయి కూడినంత తోడుపా టొసంగి రక్షించుట వైకుంఠ మార్గమునకు సోపానముగదా! దాతృత్వముచే మనహృదయంబుల వికసింపఁజేయవలయును. సర్వదుర్మార్గములకు లోనై వర్తింప మనియా, పరాత్పరుఁడు మనలను పుట్టించినది. సర్వవిధంబుల మన కాపరమేశ్వరుఁడు శుభంబులనే

నేకూర్చుచున్నవాఁడు. కాన మన మామహాత్మునిపాదసేవఁ జేసి మెప్పించుటే శ్రేయస్కరము గాని, క్రూరకృత్యములఁ జేసి శిక్షార్హుల మైన యహర్నిశ ములు ఘోరముగా ప్రజ్వరిల్లు నరకాగ్నిఁ జొచ్చుట సమంజసము గాదు.

వసంతఋతువు భూతలంబుపై చక్కందనాల పుష్పరాజంబులనుఁ జల్లి ప్రజల నానందింపఁజేయువిధంబున, మనము దీనులఁ గని కరుణారస స్వాంతులమై రక్షింపవలయును. ఈముద్దులబిడ్డను జంపి మనమేమి మూట కట్టుకొనఁగలారము. ఇఁక రాఁబోవు జన్మంబున యం:గజవిరోధిచే శిరోధిన నీచవ్రాఁత వ్రాయించుకొని కష్టములమూట నొడియం దిడుకొని నీలోకం బునం దవతరించుభాగ్యము దప్ప వేరొండు మన మనుభవింపఁజాలము. ప్రతివాఁ డీలోకంబున సత్కర్మకలాపంబు లాచరించి సన్మార్గపథంబుఁ జొచ్చుట యుత్తమము. పాపపుణ్యంబు లను రెండు మార్గంబు లీజగంబున ప్రబలియుండె. అట్టిచో పాపంబుల సంపాదించుకొని స్వర్గంబున కరిగిన, నిత్యము ఘోరంబుగ ప్రజ్వరిల్లు నరకాగ్నిపా లగుదుము. పుణ్యంబులఁ జేసుకొని నమరలోకంబున కరిగిన నిత్యానంద సౌభాగ్యంబు లనుభవించుచుఁ బరాత్పరుని కుడిపార్శ్వంబున విరాజిల్లుచుందుము." అని పెక్కుభంగులఁ బొగిలి "సార్థకనామంబుగల దుష్టబుద్ధి బాలకు న్వధించుటకు సాభిజ్ఞానంబుఁ గోరు నని కన్నీరు మున్నీరై పార లోకత్రయాహ్లాదకరుండైన యాతని వామపాదాంగుష్ఠముఁ దెగనఱికి దిక్కులేని యాబిడ్డను, భూదేవత కప్పగించి మంత్రికొలువుకూటమునకుఁ జని యబ్బాలకుఁ జంపిన ట్లానవాలుఁ జూపెట్టిరి.

కట్టా! వరోద్భవతనయపుంగవుల కిలలోఁ గడగండ్లు వాటిల్లుట, దుర్లభం బని నీతిజ్ఞులు వక్కాణించెదరు. పుత్త్రోత్పత్తికై యుపవసిత గాత్రులై సాంధ్యోపాసనాదు లొనర్చుచు వ్రతోపవాసాదులు సల్పుచు విధ్యుక్తంబులౌ ధర్మంబు లాచరించుచు భక్తిసంయుక్తులై భగవదారాధన తత్పరులై యెట్టకేల కొక్కపుత్రునిం బడసిరి. తృణకణతుల్యం బగు నిజ్జగం

బున మాతాపితలను, దుహితు సంరక్షణకర్తలనుగూడఁ బాసి యేకాకియై నిరస్తాంగసృష్టుండై పుండరీకవరాహవ్యాఘ్రాదుల భయంకరారావమధ్యంబునఁ బాంసుపాషాణమిళితంబై తనరు నొక్కస్థలంబును పర్యంకంబుగా నొనర్చుకొని దుఃఖపయోధినిమగ్నుఁడై యుండెఁ గదా! 'ఆహా దోసకారులకే దైవంబు తోడై యుండు నెప్పట్టున' నన్నసామ్యమే సంసిద్ధంబయ్యె. ఎక్కడివ్రతోపవాసాదులు, ఎక్కడిసంయమీంద్రులసేవ. ఎక్కడి భూసురారాధన, ఎక్కడివిశ్వంభరాభరుని దివ్యనామసంకీర్తనములు. తదాచారంబులన్నియు రంగదుత్తుంగతరంగోపేతమహార్ణవంబున నిడినశర్కరాతుల్యంబులయ్యె.

ఇట్లుద్దండ వేదండ చమరీ సూకర సింహకిశోర కాసర కురంగ సైరభాదుల భీషణ ఘోష సంభృత బంధురంబై యొప్పు నచ్చకితకాంతారంబున వామాంగుష్ఠచ్ఛేదనవ్యగ్ర బాధాసంజాతాశ్రుకణంబులు కనుకొలంకులనుండి యుప్పతిల్ల ఖేదాక్రాంతస్వాంతుండై యుండె. మధ్యందినమార్తాండతీక్ష్ణమరీచిజాలంబులు మేనిసోఁక దదీయసుందరమూర్తి నివురుఁగవిసిన విస్ఫులింగముకరణి ఛాయాదివిశేషంబులు సమసిపోవుచుండె. రూపలావణ్యప్రభలుత్సన్నంబు లయ్యె. నిరాహారత కారణంబుగఁ దత్కాయము శోణితశూన్యంబై శుష్కించుటఁజేసి పారాడ నచ్చోఁ బదద్వయంబు రాదయ్యె. దిగంతముల లోకబాంధవుం డని గురునామం బుపార్జించి యుప్పరంబున సహస్రకిరణకాంతులచేఁ జరియించుఁ గర్మసాక్షిగూడ నేఁడు కరుణారసప్రవాహంబు వహింపక ప్రబలకరాళనిశితభల్లంబులంబోలు తదీయప్రచండతీక్ష్ణకరప్రభావంబుచేఁ గనుఁదమ్ములవాఁడి మాయించుచుండె. తాలువులఁ జనించు లాలాజలస్రావం బుడిగి విదాహం బుద్భవించి తన్మాహాత్మ్యంబున నిరంకుశవేగాపహృతజిహ్వా కంఠంబునం జొచ్చె. అట్లు గద్గదస్వరంబున వాపోవుచుండ నశ్రుస్వేదాంబుధారలు ప్రవాహంబులుగా మారి ప్రవహింప సొటసొటఁబోవుచు వదనకమలంబు వాఁడి కౌక్షేయప్రభిన్నాంగుళిసంజాత

వేదనల క్షోర్వంజాలక వసుంధరపైఁ బోరగిలఁబడి యమందీభూతచింతాధీనాత్ముండై యసకృతంబుగా భక్తత్రాణపరాయణుండైన భగవంతునిగూర్చి, అనాథనాథ!! దీనరక్షావిచక్షణా! పన్నగశయనా! గరుడగమనా! ఓయాపన్నరక్షాపరాయణా! నమోనమో యని దివ్యనామసంకీర్తనంబుఁ జేయుచు విలపించుచుండె.

లోలాలకుఁడైన భూపాలబాలకుని నలఁగలం బాలకించి జాలివడి నానా వన్యసత్త్వలోకంబు లతిప్రేమాతిశయంబున నబ్బాలకునకు సపర్య లొనర్చుచుఁ బరిభ్రమించుచుండె. వివిధఖేచరావళులు మంగళగీతములుఁ బాడఁ దొడంగెను. ఎవడు గాపాడిన నేమి, యెచ్చోట వృద్ధిఁ జెందిన నేమి, ఆహా! సజాతీయసహవాసమునందే కదా జీవికి సుఖ మున్నది. స్వజాతి విలోకనతత్పరుండై యఖిలజంతుసంతానంబులు తన్నాదరించినను, దన యుపద్రవంబు క్రమంబుగాఁ బెచ్చుపెరుగుచుండఁ దనమనంబున మాటిమాటికిఁ దలఁచుకొనుచు నట్లుండఁ గమలిన కనుఁదమ్ముల శూన్యదృష్టిచే నలుకెలంకు లుపలక్షించుచు స్వాతియందలి వృష్టిబిందువునకై రత్నాకరోపరిప్రఫుల్ల వక్త్రియై ముక్తాస్ఫోటక ముందుకై వడి జనాగమనంబుఁ బ్రతీక్షించుచుండె.

---

# తృ తీ య మం జ రి

ఆవిపినంబున కించుక దూరమునఁ గఱకుటెఱుకులు, బోయలు, ఏనాదులు మొదలుగాఁగలవారల కధీశుండును, పరిపూర్ణ విరాజితలక్ష్మీశ్వైర్యుండును, గమనీయకాంచనదండ మండితంబు లగు ధవళచామరకలాచికాపాదుకా ప్రముఖ భూభృచ్చిహ్నయుతుండును, నఖండితవైభవోజ్జ్వలప్రభావంబు గలిగినవాఁడును, సప్తసంతానములు గడియించి వన్నె కెక్కినవాఁడును నిర్ణిద్రుఁడును వేదవేదాంగపారంగతుండు నగుచు, మృషంబుచే వంచితుండు గాక ధర్మానురక్తుండై శ్రీనందనందన పాదారవిందసేవాసంహ్లాదుండై భూసురపూజలం గావించి శూద్రుం డయ్యు రౌరవపాత్రుండు గాక యైహికాముష్మికసుఖంబు లందఁగలఁ డను ధర్మోక్తి యెఱింగి, న్యాయమాన వర్తనుండై వర్తించువాఁడునై, యౌదార్యంబున శిబిచక్రవర్తి ననుకరించుచు రాజ్యకార్యధురంధరుండై ప్రాపంచిక కష్టసుఖంబు లెఱింగినవాఁడై, యక్కాంతలమహీనాథునిదుర్మంత్రియొడ సగౌరవంబుగా మెలఁగుచుఁ గప్పంబుఁ గట్టి మెప్పు వడసి పుళిందనామధేయంబున నొక్కపాళెగాండ్ర దొర గలండు. అమ్మేదినీధవుండు కొండొకదినంబున బాలమార్తాండప్రభాభాసమానం బైన నవరత్నఖచితసింహాసనం బధిష్ఠించి పరిచారక బృందంబుల రావించి, యెల్లి మార్తాండోదయంబున మృగకీర్ణాప్రాంతం బైన కాంతారంబునకు వేఁటాడ విచ్చేయవలయు నన, నాతనిపరిచారకులు ఆనియాన శిరసావహించి దృఢనిశ్చయమనస్కులై యుండిరి.

మరునాఁ డరుణోదయంబున మృగయాయుండై గజరథఘోటకారోహణకుతూహలు లగు భటులతో సార్వభౌముండు భేరీశంఖనినాదంబులు దిశాభాగంబుల నాక్రమింప హయభద్రగజ హేషాబృంహితంబులును,

శతాంగనేమిధ్వానంబు లుప్పరంబున కెగయ వివిధాయుధ ధగధగకాంతులు కనులకు మిఱుమిట్లు గొలుపఁ బురి వెలువడియె. తత్పురీసుందరీలలామలు పురబాహ్యంబువఱకు వెన్నాడి వివిధపరిమళవరప్రసూనంబులు వర్షంబు భాతి శిరముపై గురియించిరి. పౌరులు నేస లిడిరి. అంత భూసురాశీరంబులఁ గైకొని యబ్భూకాంతుండు కాంతారంబునకుం జనియె. తత్సేనతో నాతఁడు కరధృతచాపుఁడై గుణంబులు సారించి తొడిగి పుంఖానుపుంఖంబుగా బాణంబులఁ గురిపింపఁ గాయంబులు నొవ్వ చిత్తోన్మాదంబు లంకురింప మత్తేభయూథంబులు ఘీంకారంబులు సలుపుచు మఱుగులు జొచ్చె. ఘోణ్యావళులు గోండ్రు లిడుచుఁ గొండగుహలఁ జొచ్చె. నీలకంఠంబు లుప్పరంబున కెగయుచుండె. కేసరీపుండరీకశరభంబులు స్మృతి దప్పి కువలయంబున వ్రాలె.

అంత నాదిత్యుఁడు గగనమధ్యగతుం డగుటఁ గని క్షుత్పిపాసాపీడితుండై యాభూకాంతుండు నికేతోన్ముఖుండై కడు రయంబున నరుగుచుండ, గాలివాలున నొక్కయలజడి యాలకించె. ఆకర్ణించి, ఆయార్తనాదం బెక్కడిదయియుండునోపు నని యొక్కింత నిరీక్షించి సంగతినారయ నెంచి, చనచన మారాడ నోపక యేకాకియై 'గోవిందా! వైకుంఠా! ఇందిరారమణా!' యంచు ముకుందుని పదకంజధ్యానతత్పరుండై చొటచొట దృక్కోణములనుండి బాష్పంబులు దొఱఁగ నంగలార్చుబాలుం గని భృశంబు మూర్ఛిల్లి కొంతవడికిఁ దెప్పరిలి తటిల్లతాంకురసంకాశం బగు కాయంబునుఁ గౌఁగిలించుకొని 'యేడ్చుబిడ్డకు నరఁటిపండు చూపినట్లు' తదీయోత్సంగంబుల నిడుకొని వీడినకచంబులఃహకటి దువ్వి చుబుకంబుఁ బుడికి మస్తము మూర్కొని సంతోషాతిశయసంజాతాశ్రుసలిల బిందు సందోహంబుల నాతనిముఖారవిందంబుఁ దడుపుచు, "ఆహా! త్రైలోక్యాక్రామితుండును, జతురామ్నాయముల కునికి పట్టైనవాఁడును, మాదృశులకోర్కుల నొసంగువాఁడును, సద్యోగవిభాసితమనంబుగల యాపరంజ్యోతి నేవా మాహా

త్కృత్యంబున నిప్పుడు గదా నాకుఁ బుత్త్రిండు లభియించె. ఆహా తనయులు లేకున్న నిహపరలోకంబులందుఁ గూడ గతులు లేవందురు గదా !

సీ. "కులవర్ధనం బగు కొడుకుఁ గాననియట్టి
లాఘవాస్పదునియాలయము లయము
సిరులకుఁ దొడవైన వరసుతుఁ బడయని
ఘనకలుషాత్ముజీవనము వనము
పితరులఋణము దీర్చెడిసూనుఁ గాంచని
దౌర్భాగ్యశీలుగోత్రము త్రమ్ము
రహి నిహపరసుఖప్రదుఁ బుత్త్రి నెత్తని
వరపుణ్యహీనుభవమ్ము వమ్ము
గీ. పలుపలుకు లేల నిఖిలము ఖిలము సూవె
యాత్మజులు లేనివారి కోయతివ రమణి
తరమె యనపత్యవైవర్ణ్య మరయ నతసి"

రా. పా.

అనపత్యు లపవర్గమున కనర్హులుగదా. ఇంక నాజతనంబు లన్నియు నిరాఘాటంబుగా నీడేరు. నే నెందైన భోగము లనుభవింపఁ గలవాఁడ. ఔరసుఁడు క్షేత్రజుఁడు దత్తుఁడు కృత్రిముఁడు గూఢోత్పన్నుఁడు అపవిద్ధుఁడు కానీనుఁడు సహోఢజుఁడు క్రీతుఁడు పౌనర్భవుఁడు స్వయందత్తుఁడు జ్ఞాతిరేతుఁ డన బుత్త్రులు ద్వాదశవిధు లని మునిమనుకులు ఘోషించుచున్నయవి. ఇబ్బాలకుండుఁ దనకు దానే చేరెంగావున స్వయంప్రాప్తుం డనం బరగు నని పుత్త్రునిఁగా భావించుకొని యయ్యర్భకసహితంబుగా నొక్కజవోపేతంబయిన రథంబారోహించి పరివలయితవీరభటులు గొలువ నమందానందంబున నేత్రయుగ్మంబున నానందబాష్ప సలిలంబు లుద్భవింపఁ గతిపయప్రయాణంబుల రాజధానిం జేరె. వెండియుఁ దన్నాత్రి

యించు బంధుపరిచారికాబృందంబులు భూకాంతుని పంపున విహిత ప్రకారంబునఁ దమ తమ నివేశంబులకుం జనిరి. ఆహా! ఆయువు గట్టి యైన మృత్యువదన గహ్వారంబునఁ జొచ్చియు మరలి రావచ్చును. కాలము సమీపించినఁ జక్రపాణి యైన మరణము మాన్పఁజాలఁడుగద.

అట్టిసమయంబున నాతని పట్టమహిషియగు మేధావిని రత్నకుండల హారకేయూరమాల్యచందనదుకులాదుల విసర్జించి సంతానవిహీనతచేఁ గుందుచు తనపరిచారికామణులతోఁ గూడి యంతఃపురంబున నెద్దియో ముచ్చటించుతఱి, నా భూతలేంద్రుఁడు పట్టరానిపరమానందంబున విద్రుమసోపానంబులొక్కొక్కటి పెట్టున లంఘించి దూతికాపరివృతయై యొప్పునిజదారం గాంచి "మనదీనాలాపంబు లిప్పటి కంగీకరించి నందనందనుఁ డిబ్బాలకునిఁ బ్రసాదించె" నని దైవసములును నుపాసకులును నైన పురోహితుల రావించి విహితప్రకారంబున గ్రహబలంబుల విచారించి యాశీస్సు లిప్పించి వారియనుమతిని శుభలగ్నంబునఁ బట్టంపురాణికి నీపాపను "భవత్పుత్రునిఁగాఁ బెంచుకొను" మని నుడివె.

అంత నామెయు విప్రానుమతంబున నాపట్టిం గైకొనియె. 'అన్నరసముకన్న నాదరణరసము మే' లన్నట్టు లారాజాంగన నిబ్బరంపుఁ బ్రేమంబున మచ్చిక హెచ్చి పుత్రగాత్రపరిష్వంగంబుఁ జేసికొని సర్వాంతర్యామి యైన సర్వేశ్వరునికిఁ బునఃపునఃప్రణామంబు లాచరించి యానందరసతరంగితాంతరంగయై యారంతప్రొద్దు క్షణంబుగాఁ గడిపె. ప్రత్యహము గంధోదకంబున జలకమాడించి మృగనాభిపంకంబు మై నలఁది పుష్పగంధదివ్యభూషణాంబరాదుల నలంకరించి నిటలంబునఁ గస్తూరితిలకం బిడి వివిధసుగంధవిహితతైలంబు కుంతలముల కలఁది రక్షఁ గట్టి, కుంభదుత్తుంగేందుకాంతోపలహర్మ్యంబులో వింజామరలు వీచుచుండ భర్మడోలికయందుఁ బరుండఁ బెట్టి సకలసేవకవ్రాతంబు లత్యంత ప్రేమమ్మున జోలలు పాడుచుండిరి. శుక్లపక్షమందలి విదియతదియలలో బాలేందుఁ డుద్భవించి పశ్చిమదిక్కాం

తను సన్నె తెన్నుచ్చకైవడి సామ్రాజ్యమునకు మండితాభరణమై వృద్ధినందు చుండె. నానాటికి జననీజనకు లత్యంతోపచారముల నాబాలుఁ బోషించు చుండిరి. కాని మాతాపిత లబ్బాలకుని సాహసాంసప్రవిహీనతకుఁ గుందు చుండిరి. అప్పుడప్పుడు మాత యబ్బాలకుని నొడియం దుంచుకొని “ఆహా! తొల్లి పతివ్రతామణులఁ గైకొన వెంటఁ జని జముని నెదిర్చి ప్రాణేశుని ప్రాణంబులు సావిత్రి దెచ్చె. సమస్తభోజనవిశారదుని మాయచే వేల్పుటింతుల కసాధ్యం బైనయ మాయచణకంబుల వండి త్రైలోక్యవిఖ్యాతి యనసూయ గాంచలేదె! ఇసుమును భోజ్యంబును నినుమున సూపంబుఁ జేసి ద్విజోత్తముని కోసంగి సుగుంపతి కీర్తి నార్జింపలేదె! నేను భగవదనుగ్రహంబునఁ బుత్రునకు సాహసాంశము సాధింపలేనేయని మనోనిశ్చయంబున, “శ్రీవాసుదేవా! ఆపద్బాంధవా! కృపాసముద్రా!” యని సతతము భక్తియుక్తి భగవన్నామస్మరణము చేయుచుఁ బదాహ్లాదంబునఁ గాలముఁ గడుపుచుండె. అంత లక్ష్మీపతి యచ్చిగురుఁబోఁడి పాతివ్రత్యం బెఱింగి యామె కోర్కె లీడేర్ప నిచ్చగించినవాఁడై యబ్బాలకుని విధ్వస్తాంగుళి నొసంగె. ఆహా! పతివ్రతామాహాత్మ్యంబునకంటె నెక్కుడుభాగ్యము పురాబోఁడులకు నెందైనఁ గలదె?

అంత వారలు కడు నెమ్మి నలరారుచుండిరి. ఆరాచపట్టివదనం బీక్షించి వారు లానందాబ్ధి నోలలాడుచుండిరి.

ఇట్లుండ నొక్కనాఁ డాపులింపభూపతి పట్టమహిషితోడం గూడి ముద్దులపట్టి నంకతలంబున నిడుకొని పూర్ణచంద్రుని నవ్వునట్టి మొగంబు గలుగుటంబట్టి చంద్రహాసుం డను నామకరణం బొనర్చి, సుగుణసంపన్న లగు దాదుల నియమించి యల్లారుముద్దుగాఁ బెంచుచుండె.

తన్మహిమంబలంబున మాసమునకు మూఁడువానలు బోరునఁ గురియుచుండె. వివిధసస్యఫలాదులు దున్నకయే పుష్కలముగాఁ బండుచుండె.

సురభు లపారముగా దుగ్ధంబు లొసంగుచుండె. క్షామక్షోభాదు లడంగె. ధర్మవ్యాప్తిచే భూరిసంపద లొందుచు జాతివ్రాతంబులు కల్యాణమయనయ శాలురై తద్రాజ్యంబునఁ బాదుకొని యలరారుచుండెఁ. అంత నా మేదినీ ధవుండు వివిధోర్వీపతుల సపరివారంబుగా రావించి వారల కపారపారి తోషికంబు లొసంగి నందనున కుపనయనము చేయించి యొక్క ధరామరాగ్ర గణ్యుని నొజ్జగా నియమించి గురుదక్షిణంబు లపారముగా నిడి "యిబ్బాలకుని వివిధకళాపారంగతునిగాఁ జేయు" మనియె. అంత నాభూసురుఁ డత్యంత వాత్సల్యపరిపూర్ణుండై, యారాచపట్టికిఁ జతుర్వేదంబుల షడంగంబులఁ దద్ర హస్యంబులను మన్వాదినీతిశాస్త్రంబులును బాణాసనవిద్యయందలి లాఘవ లక్ష్యశుద్ధిచిత్రత్వములను సమస్తశస్త్రాస్త్రవ్రాతంబులును, మార్వి పట్టిస సురియ గద గుదియ మొదలుగాగల భద్రాయుధంబుల సాధనంబులును గంధ గజ శతాంగాశ్వారోహణ పదలాఘవ విచక్షణత్వంబును కుంభినీధవోచితంబు లగు కళల ఐనియాజ్ఞానుసారంబున పఠియింపించి తనజనకుని కప్పగించె. అంత తదీయధనుఃప్రావీణ్యముఁ బరీక్షింప నిచ్ఛ జనించినవాఁడై తపోనిష్ఠా గరిష్ఠులు నగు ఋషీశ్వరులను విద్వత్కవితల్లజులను ధర్మస్వరూపులను సకలగణితరాజవ్యవహారతంత్రంబు లెఱింగి, స్వామికార్యనిర్వాహకు లైన యమాత్యాగ్రగణ్యులను పేరోలగంబునకుఁ గొండొకదివసంబున రావించి చంద్రకాంతోపలనిర్మితంబు లగు నుచితాసనంబు లొసంగి యం దధిష్ఠింపఁ జేసెను.

అంత బాలభానుతుల్యతేజోవిరాజితుం డైన యక్కుమారరత్నంబుచేఁ ప్రదర్శింపఁబడిన వివిధదివ్యశస్త్రాస్త్రసంధానంబు నాకర్షణంబు నారోహ ణావరోహణక్రమంబులును, నప్రమేయంబు లైన పురాణసముచ్చయంబులునుఁ గని విని కడు సంతసించి యాభూకాంతునిపంపున వారివారి నిలయంబులకుఁ జనిరి. అవ్విధంబున నా సుందరాకారుఁడు మర్త్యామర్త్య లద్భుతం బందఁ బంచదశాబ్దాంతరంబుననే వివిధశస్త్రాస్త్రసకలకళావిశారదుం డైన క్రీడిం

బోలి దశదిశల శౌర్యసముదీర్ణవిఖ్యాతి నింపి భాసిల్లుచుఁ బ్రత్యహంబును తరువాతఁ దోడిసంగడికాంద్రను, మేల్కొల్పుకొని ఘోరాటవికిం జని మహార్ణవరంగదుత్తుంగోర్మిసముదాయఘోషణంబులు పెనుభీతి పుట్టించులీలఁ జండప్రచండఘూత్కారనిస్స్వనంబుల నకార్కనమార్కోగ్రియించుచు, నమ్మహారణ్యంబునఁ గ్రుమ్మరు హర్యక్షంబుల నంతంబు నొందించుచుఁ బుండరీక షండంబులఁ జక్కాడుచుఁ బరిభ్రమించు వివిధగగనవిహంగంబుల నొకచాప వ్రేటునకుం దృణప్రాయంబుగా నేయుచు, మాయావులగు గోమాయువుల శిక్షించుచు ముక్కిడిమృగంబుల లెక్కింపక మున్ననల వీతిహోత్రుండు ఖాండవవనంబు ధ్వంసంబుఁ జేసిన తెఱంగునఁ గాంతార మంతయుఁ గల్లోలం బొనర్చి, తన్మృగావళిం గొని మిత్రులతో ముచ్చటించుచు నికేతనంబునకుం జనుచుండఁ బౌరు లాకొమరుప్రాయంపురాచపట్టిశౌర్యోజ్జ్వలప్రతాపంబులకుం గడుంగడు సంతోషించి సేస లిడుచుండ మాతాపిత లద్భుతానంద హృదయారవిందు లై పరమభాగం బని తనయుసుందరగాత్రగాఢాలింగన సుఖంబునఁ దన్మయు లగుచుండిరి. ఇట్లు కతిపయవర్షంబులు గడచిననూగుఁ మీసంపుఁగొమరుప్రాయంపువాఁడై కందర్పకోటివిలాసుండై, నయనానందం బొనర్చుచంద్రహాసునకుఁ బుళిందభూపతి యౌవరాజ్యపట్టాభిషేకం బొనర్ప నెంచి దైవజ్ఞుల రావించి గ్రహనక్షత్రంబులఁ జూపించి సుముహూర్తంబు నిశ్చయించి తద్వార్త తత్పురంబునఁ జాటింపించె.

అంత నాపుటభేదనపౌరు లానందపరవశులై రత్నమయనికేతన ప్రాంగణములఁ జందనోత్కరగంధయుత తుహినతోయంబులఁ జల్లిరి. కలువడముల ముక్తాఫలతోరణంబులఁ గట్టిరి. రచ్చలఁ గ్రంతల విపణిదేశంబులందు రమణీయసింధూరపాండుర ప్రసూనమాల్యంబులతో ద్వారంబు లలంకరింప మలయానిలప్రసారంబునకు నెత్తావిఘుమఘుమలు దశదిశల వ్యాపించి, ఘ్రాణోల్లాసం బొనర్చుచుండె. కర్పూరమృగమదకుంకుమాగరు ధూపకుంభంబులును, విరాజితసముద్ధూతపతాక విభ్రాజితంబులై యప్పు

రంబు సకలజనహృదయసమాహ్లాదనం బౌనర్ప స్వర్ణాభరణ వివిధోజ్జ్వ లాంబరధారులై వేడుకలఁ గనులార వీక్షించుచు నందందు శ్రూయమాణంబు లగు శ్రావ్యగీతనినాదంబులచే మేనులు మఱచి తాము నృత్యంబులు సల్పుచు విహరింపఁదొడంగిరి. భూనిలింపు లంచందు చతుర్వేదపురాణంబులు వల్లె వేయుచుండిరి. స్వైరిణీకాంత లాడంబరంబుగా నర్తనాగారంబు లందు గీతప్రబంధములఁ బాడుచు విపంచికానాదంబులు సల్పుచు సంతో షాతిశయంబున నెలఁగుచుండిరి.

అంత వృద్ధసుమంగలు లుత్పలచంపకప్రసూన సువర్ణతంతునిర్మితం బైన పుష్పదామంబుల దీవనలతో నాయువరాజుకంఠంబున వైచిరి. భూసు రులు వేదోక్తాశీర్వాదంబులు సెలంగ, గంగాయమునాగోదావర్యాదిపంచ గంగలచే నబ్బాలకు నభిషిక్తుం గావించి రమణీయదుకూలంబు లొసంగి సువర్ణపట్టంబు నుదుట గట్టిరి. తదనంతరము ప్రధానామాత్యుఁ డబ్బాలకునిఁ గొనివచ్చి సింహాసనాసీనుం జేయ నల్దిక్కుల జయజయధ్వానంబులును, కరతాళధ్వనులును జెలఁగె. అంతఁ జంద్రహాసుండు నిస్తంద్రవిభవసాంద్ర కీర్తిచంద్రికల దిశాభాగంబుల వెలయించి, దోర్గర్వసంపన్ను లైన భూపవ రేణ్యుల నైంద్రజాలికకృత సమ్మోహనప్రభావంబునుంబోలెఁ జమూసమే తంబుగా వశంవదుల గావించుకొని మహీతలం బంతయు నవక్రపరాక్రమం బున శాసింపఁ దనతంత్రికిఁ దోడ్పడుచుఁ దనరాజ్యంబునఁ గృతయుగ ధర్మంబు స్థాపించి ప్రజానురంజకుండై తలిదండ్రుల నానందాబ్ధి నోల లాడించుచుండె. శ్రీవిష్ణుభక్తిపరాయణుండై తద్దేశంబునం గల జనాళి నెల్ల నేకాదశీవ్రతంబులు, విష్ణుపంచమీశ్రీజయంత్యాది వ్రతంబులును, విద్వజ్జనపూజలును జేయఁ బ్రోత్సహించి విఖ్యాతంబుగాఁ గొనసాగించు చుండె.

ఇట్లు కతిపయ దివసంబులు మాతాపితృసేవనముననుఁ బ్రజాక్షేమ కరంబు లగు సత్కార్యాచరణంబుననుఁ గాలంబుఁ గడపుచుండి, దిగ్విజయ

యాత్రాభిలాష యాతని మనంబునఁ బొడమి నానాఁటికి హెచ్చఁగుడుఁ దనమనోగతంబు జననీ జనకుల కెఱింగించి వారియనుమతంబుఁ గొని చతురంగ సేనాసహితంబు లగు బలంబులఁ గూర్చి దండనాథునకు ముదల యిడి చమూసమూహంబులు సమకూర విజయభేరి మ్రోయించి రాజ్యం బమాత్యుల కప్పగించి యొకసుముహూర్తంబునఁ బురంబు వెడలె.

ఇట్లు చంద్రహాసుండు మత్తేభ స్యందన వీరభట పటలీచటులం బైన సేనాసముదయ పురస్సరంబుగాఁ జనిచని నరుదులు గెల్చి బిరుదంబులఁ గొని యట నంగ, వంగ కళింగ, కాశ్మీర, కర్ణాట, కరూశ, కైవర్తకాది నానా జనపదంబులఁ జొచ్చి వీరవరుల ఖడ్గధారాప్రహారచ్ఛేదిత కంధరప్రకరులం గావించి, వీరావేశంబున సామ్రాజ్యంబులఁ గెల్చి తుంగంబు లగు భద్రగజేంద్రంబులును, వేగశీతహారిణంబు లైన ఘోటకంబులును ప్రభాజిత కౌస్తుభంబు లగు రత్నాభరణంబులును హేమభూధరశృంగంబుల మించు కనకంపు రాసులును మౌక్తింబులు నాదిగాఁగల విశేషసంపదల మెండుగ నుపార్జించి, యమరాధిపతిసొంపున భూనభోంతరాళంబులు మత్తమాతంగసింధురపదాతి పదోద్ధూతధూళులచే నిండి దివం బంధకారబంధురంబై యుండ నానంద భరితం బైన చంపనావతీపట్టణంబునకు విచ్చేసి తలిదండ్రుల పదపంకజంబులకు నమస్కృతు లొనర్చి, నిజబాహుబలోపార్జితంబులు నైన కమనీయప్రభాభాసితంబు లగు రత్నపుంజంబులచేఁ దనబొక్కసంబుఁ బెద్దఁ జేసి, మాతాపితృపదశుశ్రూషణంబునను, సంస్కృతాంధ్ర పండితామాత్యాశ్రితపోషణంబునను, నిత్యకర్మానుష్ఠానాది సత్కర్మాచరణంబుననుఁ గాలంబుఁ గడపుచుండె.

అంత నొక్కదినంబునఁ బుళిందభూపతి యత్యంతోత్సాహపూర్ణుండై తదీయపుత్త్రునిం గరంబున నిమురుచు "వత్సా! మన మాదినుండి కుంతల దేశాధీశుని గొలిచినవారము. అచ్చట మనకుం బ్రాపతనియమాత్యుం డగు దుష్టబుద్ధియుఁ దత్పురోహితుం డగు గాలవుండును. మనము వారి క్షమే

యర్థంబుఁ గప్పంబుగాఁ జెల్లింపవలయును. కనుక నమ్మువ్వురకు వెవ్వేఱు మూఁటలు గట్టి పదివేలు నైదువేలు రెండువేలుగా నిష్కంబులఁ బనుపు మనినఁ బ్రత్వాజ్ఞ శిరసావహించి బొక్కసంబునకుం జని భారవహుల నియమించి మంచికంచరంబులమీఁదను లొట్టియలమీఁదను వేయించి సముచితపరివారంబులతో నొక్కకమ్మ లిఖియించి యీ మూఁడుమూఁటలు గల ముడుపులను భూభర్తకును బురోహితామాత్యుల కొసంగుఁ డని దీర్పరులు నేర్పరులు నైన నియోగులఁ గొందఱఁ గొంతలంబున కనుప, వా రరిగి భక్తిసంయుక్తులై యా పార్థివేంద్రామాత్యాశ్రిత పురోహితులకుఁ బ్రాంజలులై చంద్రహాసుం డొసంగినయర్థంబు లొసంగి కమ్మల నిచ్చి "ముందటికంటె నిపు డపారంబుగా ధనంబుఁ దెచ్చితిమి. కైకొని రాజున కొసంగు" మని మంత్రిపుంగవుని కప్పగింప, నాతఁడు రాజద్రవ్యంబు బొక్కసంబునఁ జేర్చి పురోహితునర్థం బాతని కొసంగి తన భాగంబుఁ దాఁ గొని యవ్వార్తాహరులకు సెల వొసంగి పంపె. అంత దుష్టబుద్ధి పుళిందుని కిట్టియర్థం బెక్కడ లభియించె నని విచారించి గూఢచారుల మూలమునఁ దద్వృత్తాంతము నాలించి యెట్టు లైనఁ బుళిందుని భంగంబుఁ గావింప నెంచి యదను నిరీక్షించుచుండె. అంత నొక్కనాఁ డాకొంతలమహీనాధునిచెంతకు నాదుర్మంత్రి చేరి చంద్రహాసునతెఱ గెఱింగించి, "రాజేంద్రా! తొల్లి చందనావతీవసుమతీశుఁడు మనకు విధేయుఁడై యడఁగి మడఁగి మనయాజ్ఞ జవదాఁటక కప్పంబుఁ జెల్లించుచున్నవాఁడు. ఐనను వివిధజనగీతపుణ్యశ్లోకుండై స్తోత్రపాత్రుండై వరలుచున్నవాఁడు. ఇట్లీకఁ గొంతకాలము మందమతులమై యాతనియైశ్వర్యధురంధరత్వంపుఁబొం గడఁగింపమేని గొండొకకాలంబునకు మన సామ్రాజ్యంబు నుద్దండవేదండస్తోమంబులతో వచ్చి కైకొను ననుటకు సందియము లేదు. క్షుద్రనృపునివలని యుపద్రవము వాటిల్లకపూర్వమే వానిమచ్చ మాపవలయు" నని మాయోపాయంబుల నుడివి, యశోవిహారుం డగునయ్యనుపమస్వాంతుని రాజ్యభ్రష్టుం గావించి యాతని వంశాళినిఁ దెగటార్ప సెలవుఁ గైకొని మహాహవదీక్షితుండై

కుటిలస్వభావము పొంగిపోవ వాయువాహనతుల్యం బగు హయం బధిష్ఠించి శిరస్త్రాణంబు ధరియించి చతురంగబలసమేతుఁడై షడ్యోజనంబు లొక్క పెట్టున దాఁటుచుఁ జందనావతీపురి సమీపించి, తనవీరవరులతో, " మున్ను నానాస్థావరజంగమనికాయంబులతో శరభహర్యక్ష వ్యాఘ్రాదిక్రూరజంతు నివాసంబై యొప్పు నీస్థలం బిప్పుడు సౌభాగ్యోన్నతుల కాకరంబై విలసిల్లు చున్నయది. ప్రముఖశూరాగ్రేసరనికరంబున కజేయంబై పురచతుర్భాగంబు లందుఁ బరిఖలచే నలరారుచున్నది. వీణాగాననినాదంబులు శ్రీనాథసేవా మిషంబున నభంగకరతాళమృదంగనిస్స్వనంబులు గల్గి యమరావతీపురిని నిరసించుచు సంపదలయం దుత్తరదిశాధీశునిఁ బరిహసింపఁ జాలినదై ప్రకాశించు చున్న దని ముచ్చటించుచుఁ బోవుతఱి తనరాక నెఱింగినవాఁడై పుళింద భూపతి యత్యంతసంతోషతుందిలహృదయుండై బంధుమిత్రపుత్రామాత్య సేనాపరివృతుండై తూర్యఘోషంబులతో వారిని నెదుర్కొని, విధ్యుక్త ప్రకారంబుగా క్షేమవార్త లడిగి యర్ఘ్యపాద్యాదు లొసంగి తూర్ణంబె సకలసంపత్పరిపూర్ణంబు లగు రమ్యహర్మ్యంబుల నివేశంబులుగా నియమించి యనర్ఘవిచిత్రాంబరరత్నకలితము లైన పసిండిపళ్లెరంబులును, సందీపిత వివిధ వస్తువ్రాతంబు లర్పించినఁ గపటచటులచాతుర్యంబు మనంబునఁ గప్పిపుచ్చి కూర్మిల నించు భావవిలోకనంబున దరహాసంబు దళుకొత్త " ఓ పుళిందభూవరా! అఖండసామ్రాజ్యవిభవసముపార్జన నిన్నఖిలైశ్వర్యసంపన్నునిగా నొనర్చి తనయశశ్చంద్రికలచే లోకంబును బ్రకాశవంతముగాఁ జేయంజాలిన యిబ్బాలకుం డెట్లు లభియించె? నీ కొరకు లెన్నఁడును లేరని నే నెఱుంగుదుగదా." యని ప్రశ్నింప నభ్భూధవుం డిట్లని వాక్రుచ్చె.

"మంత్రిపుంగవా! యే నొక్కనాఁడు సకలసైన్యసమేతముగ మృగయావినోదంబుకొఱకు నిబిడదుర్గమకాంతారంబునకుం జని కుంతలపురంబునకు యోజనద్వయదూరం బగు నాదురవగాహం బైన విపినంబునఁ గౌక్షేయాఘాతచ్ఛిన్న వామకరాంగుష్ఠసంజాత బాధచే దోదూయమానమానసుండై పొంగిపోవ నేడ్చుచు రమాకాంతునిఁ దలంచుచుఁ గాలముఁ గడపుచున్న యుప్పాపనుఁ గనుఁగొని యితఁ డుపేంద్రుని భక్తుం డై యుండనోపు. ఏ ననపత్యుండ

నా కీబిడ్డను విష్ణువొసంగె నని నిశ్చయమనస్కుఁడనై తోడ్కొని మన్మందిరంబునకుం గొనివచ్చి కన్నపుత్త్రునికంటెఁ బదిరెట్లధికప్రేమాతిశయంబునం బెంచితి. ఈనాఁటికి పంచదశాబ్దంబులబాలుం" డని విన్నవించె.

దుర్మంత్రి మనంబున నానాఁడు మాలలచేఁ దెగటార్పఁ బనుపఁబడిన వాఁ డీతఁడై యుండునో! యనుకొనుచు నుగ్రభల్లంబునఁ బొడిచినకైవడి నిట్టూర్పు లిడుచుచుఁ దన్మనంబునఁ జింతాక్రాంతుండై, యాచండాలురపై దంతసంఘట్టనంబుఁ జేయుచు నిప్పట్టులో నేదైన ప్రమాదం బీతనికిఁ జేయఁ దొడంగితినేని, మహి ననాగతకార్యంబు మది దలంచి కోరువానికైవడి దుఃఖంబు నొందఁగలాఁడను. 'చిక్కఁ జికిలించుటకంటె వెళ్లి వెక్కిరించుట మే' లన్నట్లు చతురుపాయసామర్థ్యంబున మచ్చమాఁప వీనిఁ గొంతలపురంబునకు నేదే నొకనెపంబునఁ బనిపి యక్కడ, మత్సూనుండైన మదనునిచే విషము వెట్టించి చంపించెద. సాధుజనప్రగల్భవాక్యంబు లెట్లు కొనసాఁగునో చూత మని యూహించి తనతనయునిపేర నేదే నొక్కలేఖ స్వహస్తంబున లిఖియించి ముద్ర వైచి యనన్యాలోకనంబుగఁ జేరం డాసి, "చంద్రహాసా, యిక్కమ్మను నేరికిఁ బొడగట్టనీయక నీ వొక్కరుండవే కుంతలపురంబునకుం జని నాతనయుఁ డగు మదనుని కిమ్ము. అచ్చోట నీవు వలసిన సకలశుభములుఁ గలుగును. మత్సూనుం డుదంచితోన్నతులచే నన్నుఁ గృతార్థునిఁగాఁ జేయును." నావుడు నాకుహనోక్తిజాలంబు లాలించి కపట మెఱుంగనేరక నిస్తంద్రచిత్తుఁడై పోవ సమకట్టి యాతనికి నమస్కృతులొనర్చి, తలిదండ్రుల యొద్దకుఁ జని ప్రయాణవృత్తాంతం బంతయు నెఱింగించిన వా రది యెఱింగి "తనయా సమస్తశస్త్రాస్త్రవిద్యలయం దారితేరినాఁడవు. తారుణ్యావస్థలోనే భవత్కీర్తిలతలు నలువంకల వ్యాపించినవి. ఇఁక విజ్ఞానసంపన్నులలో ముందే మేటివాఁడవు. నీశుభ్రఖ్యాతిమహిమ వర్ణింప భూభారము వహించిన శేషునికైన నలవి గాదు. అయినను బుధోక్తిజాలంబు లమృతతుల్యంబులన్నట్లు నీ కుపదేశింపవలసిన ధర్మము మాబోంట్లది." అని తత్కాలోచితోపదేశంబు లొనర్చి యక్కునఁ జేర్చుకొని ముద్దిడి యాశీర్వదించి యనిపిరి.

# చతుర్థమంజరి

---

అంత నినుండు ప్రాగ్దిగంగనతో సరస సల్లాపంబుల సల్పి సింధూర తిలకంబు ఫాలంబునం గీలించి మలయమందానిల విహారంబున విహరించు మారుతాశనహారి మాణిక్యంబో యన్నట్లు, ప్రభాతంబునఁ బ్రాజ్యమహీధరంబుపై నుద్భవింపఁ దటాకపుండరీకషండంబులు విరియఁబారి మేదురోజ్జ్వలపరాగసౌరభ మనిలోద్ధూతంబై నానాదిక్తటంబులఁ బిసాళింప, నాపరాగభక్షణాకాంక్షులై మధుకరపుంజంబులు తండోపతండంబులుగా నరుగుచుండె. పాదపపత్రాగ్రనీహారబిందువులపై నాదిత్యకరకాంతి ప్రతిఫలించుటచే నుష్ణాంశుపాషాణఖండంబులా యనఁ గన్పట్టుచుండె. వృక్షాగ్రంబులఁ బక్షిబృందంబు లెఱకలు విప్పి కువకువధ్వనులచేఁ బర్విడఁజొచ్చె. సద్యోజాత నూత్నానందంబున చంద్రహాసుండు బలిష్ఠం బైన యొక్క హయం బారోహించి విరాజితరత్నభూషణాంబరాదులు ధరియించి పురంబు వెడలె.

ఇట్టులఁ జనిచని చటులధాటీనిరాఘాటంబుగా మనోహరంబుగ నేకాకియై మత్తేభచిత్రకాయదందశూక కిటికేసరి కాసరాదిజంతుసంతాన సంకులం బైన యొక్క కాంతారంబు నుత్తరించి నిమేషమాత్రంబునఁ గౌంతలపురసమీపంబునకుఁ జనియె.

తత్పురప్రాంతంబున నొక్కయుద్యానవనంబున మలయజతక్కోల తాల తమాల హింతాల కాంచన సహకారాశోక క్రముక శాల్మలీ నారంగ రంభా ఖాదిరాద్యనేకకుటజ సంతానసౌభాగ్యదీప్తిలలితమై పల్లవకుసుమ పక్వఫలభారంబున వినమ్రమైన యామంజులంబుగా ధ్వనించు నుద్యత్కీర శారికాకేకి భృంగంబులు, తదీయ శాత చంచూపుటనిర్దళితఫలరసప్రవాహం

బును, వివిధసౌరభము లొసంగెడి నానాలతాంతనివహంబులుఁ గల్గి యాయు
వరా జరుగునప్పుడు చల్లని మందమారుతము మేనికి సోఁకె. పుష్పములు
వర్షించె. ఆహా; సహస్రకవచుని మర్దింప నరనారాయణులు తపం బొనర్చిన
పుణ్యక్షేత్రంబా ? బృందావనమా ? యని యొక్కింతతడవు తనలోఁ దాను
వితర్కించుకొని పొంగిపోవు హర్షోత్కర్షంబునఁ జనఁజన నాయుద్యాన
మధ్యప్రదేశంబునఁ గోకకోకాంగనావివిధబంభర ఝుంకారసంకులం బైన
యొక్క కాసారంబు ఝషకుళీరకమఠాది జలచరసంకులంబును, జలకుక్కుట
మరాళబలాకసముదంచితజలవిహంగవిసరంబును నగుచు నించుక సమీపింప
శాద్వలంబులమీఁద నిర్భయంబుగా మేయు కారండవవ్రాతంబును శిరసులపై
మేలుకట్లుకట్టినట్లు లంబమాన జటిలలవలీనికుంజంపుజంపులును ఆసోయగంబు
నినుమడింపఁ జేయుచుండు వినోదంబును గాంచుచుఁ గుతపకాలంబునఁ బరి
క్లిన్న దేహుఁడై విమలోదక మాస్వాదించి లలితరసాలసాలతరుచ్ఛాయఁ బుష్ప
గుచ్ఛములపైఁ బవ్వళించి జలకణయుత మగుచుఁ బ్రసూనపరిమళమిళితం
బైన చల్లని మందమారుతమునకు మేను పులకరింప "ఆహా! నేఁటికి సకలేం
ద్రియములకు నమృతత్వముఁ బ్రసాదింపఁ జాలు నికాసారోదకం బిలనుండఁ
దిరుగ హాటకగర్భుఁడు పీయూషోత్పత్తి చేయుట వ్యర్థమే. రమేశుఁడే
యాదిలో దీనిని దిలకించిన నింక నేల కలశాబ్ధిపై శేషశయ్యను బరుండు.
మమ్మాటికి నిది మన్నుండలేదు. కానిచో నాదివరాహపు కొమ్ముదెబ్బకు
భయాంకుర సంచకిత యైన భూదేవి కుంభసంభవుఁడు గ్రోలి విడిచిన యాశర
నిధి నేలదాఁగును ? జగత్సృష్టికి మును మున్నుండెడు నుదకమయమైన య
జాండ మీ భంగి నిప్పు డిచ్చోటఁ బొడగట్టెనని యూహించెదను" ఇట్లనేక
భంగుల మనంబునఁ గౌతూహల ముప్పొంగుచుండ నాశ్చర్యభావంబున నా
రాకొమరుఁడు సుఖంబున నిద్రించె.

తత్సమయంబున సాకుంతలమహీనాథునితనూజ యగు చంపకమాలి
నియు, దుష్టబుద్ధిసుతయగు విషయయు మన్మథశిలీముఖంబుల వేటన కోర్వం

జాలక తత్ప్రాజామిషంబున మణిముద్రికాలంకృతం బగు కెంగేలఁ గొందఱు సుశీలలామలఁ గైదండ గొని సొంపుమీఱిన ముత్యాలసరంబుల వక్షంబుల హత్తించి పదియాఱువన్నె పసిండికి మెఱుంగు వెట్టఁజాలెడి మేనిసోయగంబు తోడ సొంపైన మేనిదట్టంబులు సింగారంబుగాఁ దొడిగి మీనాంకుని చక్రంబులం బోలె మిణుకుమిణుకు మనుకపోలతటంబుల మెఱయింపంజాలు రతనాల తాటంకంబులు దగిలించి, వాలారుపుష్పంధయముల నిరసింపంజాలు వేణులపైఁ గుందకుట్మలంబు లిమిడ్చి సరసంపుఁబలుకు లుచ్చరించుకొనుచుఁ గార్మొగులనడుమ విలసించు క్రొక్కాఱుమెఱుంగు తెఱంగున నొయ్యారంపుమందగమనంబుల వనంబున నందందు విహరించుచు ఫలంబులఁ ద్రుంచుచు ప్రసూనహరణంబుఁ జేయుచు సుమనోమరందపానమదోన్మత్తలై ఝుమ్మని ముఖంబులఁ గ్రమ్మ తేంట్ల నదలించుచు, భ్రమరఝంకారంబులకు విసవు కొనుచుఁ బికస్వనంబులకు మాఱ్వలుకుచు మయూరక్రేంకారంబుల కీసడిం చుచు మరాళిమందగమనంబు ననుకరించుచు, నొండొరులతోఁ బరిహాసంబు లాడుచు సంచరించుతఱి నొక్కకలహంసగమన కేలు సాఁచి పుష్పాపచ యేచ్ఛచే నఖప్రసూనవృక్షంపుశాఖిక గ్రిందికి వంప నక్కాంతామణులపై కెఁ బువ్వులు జలజల రాలె. అది గని యొక్కసుందరదన 'ఔనౌను చెలీ; యియ్యది నీ వివాహంబును సూచించుచున్నయది. కుటజపురుషుండు శాఖా హస్తంబులచేఁ బుష్పరాగహరిద్ర సమ్మిశ్రిత ప్రసూనమౌక్తికంబులచే సేసలు చల్లుచున్నవాఁడు' అన నయ్యమాత్య పుత్రికకు మేను జలదరించె. అది గని మఱియొక్క పూఁబోఁడి 'అగు నగు, మనవిషయ మేను జలదరించుచున్న యది. మున్నాఁటికి నిక్కుటజపురుషుండు నిక్కన్నియపైఁ బుష్పభల్లంబులఁ బ్రయోగింపఁబోలు' నన నప్పికవాణి లజ్జచే మోము వాంచె. అంత నింకొక భ్రమరవేణి యమ్ముద్దియం గాంచి, 'చెలీ; నీమనోనాయకుం డగు నాసుం దరుం డెవ్వఁడో యెఱింగింపవే' యని మేల మాడె. అంత విషయ వదనంబు విన్నవోవ నించుక యాగ్రహంబును సూచించుచుఁ 'జాలు లెండు. ఏటి మేలము లివి. మీ కంత విరాళి హెచ్చైనచో మీప్రియులకడకే పొం' డని

దరహాసంబుచేఁ గసరుచు శీఘ్రగతిం జని తదారామస్థితసరోవరసమీపంబు నకుం జని తదుపాంతస్థిత చంద్రశిలావేదికపై మౌనముద్ర దాల్చి యుపవిష్ట యయ్యె. అంత నక్కన్నియ లందఱు విషయసమీపంబున కరిగి "యేమే పరిహాసంబునకే యింత కినుకయా. చాలుఁజాలు నీతోడిసఖ్యము. ఇంతటనైన నీయాగ్రహ ముడుగుము. జలక్రీడ లొనరింతము రమ్ము". అని పరస్పరాను బంధంబున జలజాకరముఁ జేరం బోయి మణిమయహారాంబరాదు లూడ్చి తత్తీరంబున నునిచి, యొండొరులు చేతులు పట్టుకొని మెల్లమెల్లన నీరంబుల డిగి సలిలవిహారసంతోషంబుచే నందుఁ దోఁగుచు, నొక్కరిమీఁది కొక్కరు దోయలించి దోయలించి తోయంబులఁ జల్లుకొనుచు జలావగాహంబు లొన రించుచు విషయ యలసి కెలఁకుల నున్న కేతకీపుష్పంబులఁ జిదిమి కేలం గొని తద్గంధ మాఘ్రాణించుచుఁ జెలీ! యిప్పాండుప్రసూనగంధ మాఘ్రాణింపుము. చిత్తంబునకు నూత్నవిలాసంబుల నొసంగుచున్నది." అనుచు నాసుందరి సుందరమందహాసంబుతోఁ, గటిదఘ్నం బగు తోయంబునుండి యాకెలఁ కునకుం జనియె.

పదంపడి యానిద్రించు రాపట్టిమై తావులు వివిధకుసుమతతులతో మిళితంబులై పిసాళించులీల నొక్కదివ్యమన్మథప్రభంజన మంకురించి పరి సరంబులఁ బ్రసరించె. తదాఘ్రాణంబున కబ్బుర మంది యత్తరుణీమణి, "ఆహా! లతాంతాయుధునిసుగంధము వ్యాపింపఁదొడంగె. ఇయ్యది యెక్కడి దయి యుండనోపు" అని మనంబున నిర్భరానందంబుతోఁ బారిప్లవేతరవిస్తా రితలలితాక్షియై నలువంకలఁ దిలకించుచు, నాత్మగతంబున, "ఓహో! మన్మథ ప్రభావంబుచే నే నిట్టియాదృచ్ఛికమైన గంధ మాఘ్రాణించితి. ఇఁక నేటి మాటలు. ఇట్టితారుణ్యమం దొక్కగడియ యైనను, మన్మథతాపంబున కోర్వంజాల. నయనానందకరుం డగు పురుషరత్నంబు కౌఁగిట నొక్క క్షణమేని యుండి మరణించిన నాకలోకానంద మనుభవింపఁగలను. పూఁదూపునిబాఁటికిఁ దగులొన్న నాతుల కిట్టి సంకటములు సంభవింపక

మానవు." అని పరిపరివిధంబులఁ జింతించి దూరీకృతనిమేషంబుగ దృష్టి
ప్రసారించి గమకించుచుఁ గలయ విలోకించుచుండె. అంతఁ బీతాంబర
ధారియు, రత్నఖచితకుండలద్వయవిరాజమానకర్ణుండును, జాజ్వల్యమానవివిధా
మూల్యరత్నఘటితకిరీటియు నగుచు నాకారతేజోవిశేషంబున మరుని మీఱం
జాలి యధ్వశ్రమంబునఁ గడు డస్సి నయనానందకరదళప్రసూనఫలభారంబుచే
వసుంధర స్పృశించి వినమ్రమై యున్న యొక్క సహకారతరుచ్ఛాయఁ బచ్చిక
బయలుపై శయనించి నిదురించు నొక్క సుకుమారమారసుందరాకారుని
వీక్షించె. అంత నాకన్యకారత్నంబు క్రేగంటిచూపులు నిగుడించుచుఁ
జారుపయ్యెద సవరించుచుఁ గటికిచీఁకటుల నతిక్రమించు నిడుదపెన్నెఱిగుంపు
కొనగోట దిద్దుచు దేహంబున ఘర్మాంబువులు గ్రమ్మ పులక లావిర్భవింప
నిశ్చేష్టయై జంత్రపుబొమ్మకైవడి నిలుచుండె. కొంతవడికి మనంబు నొకింత
దిటవుపఱచుకొని కటకంబులు మెట్టెలు మొలనూలుమువ్వలు మ్రోయకుండ
మెల్ల మెల్లనం జని యనిమేషనయనంబుల నామూర్తిం గాంచుచుఁ జక్కెర
విల్తునిబాఱికిం జిక్కి, "ఆహా! మోహనం బగు పల్లవాధరంబునుండి తేనెలు
ప్రవహించుచున్నవి. ముఖమండలంబు పూర్ణచంద్రునిపెం పపహసించుచు,
కుందనంబుఁ బోలు మైకాంతినిం గలిగి పొందమ్మిసోగదళంబులమీఁద
పుష్పంధయము లున్నలీలఁ బెద్దకన్ను లమర, నామనంబు నపహరించిన
యావన్నెకాఁ డెవ్వం డయియుండునో?" ఇట్లని పరిపరివిధంబులఁ
జింతించుచు నొక్క యశోకవృక్షంబుపొంత నోసరిలి నిలుచుండి, యమ్ము
ద్దియ సంతత నేత్రోద్భూతలజ్జాపరంపరలు చెక్కుటద్దములకు సొంపు
నాపాదింప వదనంబున దరహాసంబు దళుకొత్త నీక్షించి సిగ్గుపెంపున నా
జవ్వను మేల్కొల్పి ముచ్చటింపఁజాలక ఈతని వివాహ మాడని నా కీజన్మం
బెందుల కని చింతించుచుఁ బరికించుతఱి నాతనియంసోత్తరీయంబున నడపపు
సంచి త్రాటం గట్టఁబడియున్న లేఖ దృష్టిగోచరం బగుడు గడగడ వడంకు
పాదంబులతొట్రుపాటుతోడ నమ్మారాకారు సమీపించి, యాకమ్మ
నీక్షించి యది తనతండ్రి స్వహస్తలిఖితం బని యెఱింగి మనంబునఁ గౌతూ

ఘాలం బఠిశయింప నాతనికి నిద్రాభంగము గలుగకుండ మెల్లన నాచీటిం గొని యవ్వక్కణ మాద్యంతంబునుం బఠించి కుటిలచిత్తుఁడైన తండ్రిబుద్ధికి మదిఁ జింతించి నిట్టూర్పులు నిగిడించుచు నిశ్చేష్టితయై నిలువంబడి కొంత వడికి నుపశమితదుఃఖయై "అకటకటా! యివ్వసుంధర ధరణీపతులు కొందఱు ప్రాభవముకొఱకును, ధనధాన్యాదులకొఱకును, లలనాలలామం బులకొఱకును, శ్రీలకును, రాజ్యమునకును నాసపడి భావ్యనుభవంబుల యోజింపక వృద్ధిక్షయంబు లెఱుంగక యన్యుల హింసింప నించుకంతయు వెనుదీయరు. ఏతల్లిగర్భంబునఁ ద్రైలోక్యసమ్మోహనమూర్తి యగు నీ సుందరమూర్తి యుద్భవించెనో, యెట్టిప్రాక్కర్మోపార్జితం బగు మహాఘ ఫలితంబుగా నీజన్మంబున నిట్టి యమేయదుర్మరణంబు నొందఁబోవుచున్నాఁ డో; కట్టా! యీతనిఁ బరిమార్పింప నాతని కెట్లు మనం బుత్సహించె. అయిన నేమి? మంచిది, కానిమ్ము. ఈతనియసురులు సంరక్షించుటయే యిధరణిలో నాకుం బరమధర్మంబు, సుకృతంబు." అని యారాజనంద నునికి వాటిల్లిన మహాపన్నివృత్తికొఱకై యొక్కింతతడవు మదిఁ జింతించి మనంబు దిటవు పఱచుకొని యొక్క యుపాయం బూహించి, దరహాసచంద్రికలు వదనమండలంబున నర్తనం బాడ "వీఁడు మన కమి త్రుఁడు. విష మొసంగు" మని లిఖియింపంబడినలేఖ సవరించి "వీఁడు మనకు మిత్రుఁడు, విషయ నొసంగు" మని లిఖియించి యథావిధిగా ముద్ర వైచి యడపపుసంచిత్రాటం గట్టి యారాకొమరునివదనేందు మండలలగ్నం బైన యాత్మీయనేత్రచకోరముల మఱలింపఁజాలక మోహనాలోకన విభ్రమంబున నడువఁ గాల్లాడక యతికష్టతరంబుగా నావాల్గంటి తిరిగి తిరిగి చూచుచు నెట్లో యప్పటియట్లు నిట్టూర్పులు నిగిడించుచు నచ్చోటు వాసి దాడిమీబాలరసాలతరువుల పొంతకుం జనుచు, విచారాక్రాంత యగుచు ముఖంబున జుమ్మని ముసరు మధుకరపుంజంబుల నదల్పక చెదరిన కచంబులఁ జక్కచేయక, పయోధరంబులపయిం బడు పరస్పరసక్తంబు లగు హారంబుల విడఁదీయక పంచశరనిర్ముక్తసాయకంబులబారికిం జిక్క

దేహంబు వడఁక మిన్ను విఱిగి పైఁ బ్రాలినయట్లదరిపడుచు "ఈతనిజన జనకు లెవ్వరై యుందురు. ఈతని దేశ మెద్దియై యుండునో కో? ఇతని నామ ధేయాదివిశేషంబు లేమైయుండునో? ఇట్టిపురుషరత్న సమాగమము ప్రాప్తించెనా, యైహిక కర్తవ్యాధ్వరగోసువర్ణకలధౌతదానాదులను వ్రతోపవాసాదులను నొనర్పకయే కైవల్యప్రాప్తి లభ్య మగును. తొల్లి మమ్ము సృష్టించుచో విరించిలలాటలిఖితం బెట్లొనర్చి యిజ్జగంబున నుత్పత్తిఁ గావించెనో, తల్లిఖితంబు లేరికి విదితం బగు" అని కన్నీరు మున్నీరై పొఱి విలపించుచు మన్మథాధీనచిత్తయై యయ్యండజయాన బిత్తరంపువిలోకనంబుల సారించుచుఁ బరాధీన యగుట దుఃఖంబు మనంబునఁ గప్పిపుచ్చి, యుక్తమార్గంబున దీనమానసయై యేమియు నెఱుంగనియట్లు సఖీజనసమేత యగు రాజపుత్రిం గూడి పురంబుఁ దరిసి, తదనుమతి వడసి నిజమందిరంబునకుం జని యాహారాదుల నొల్లక తమకంబున నిదురం జెందక చెలికత్తెలతో ముచ్చటింపక ప్రాసాదజాలకంబునఁ జంద్రహాసురాకకై వేచియుండె.

అనంతరంబ చంద్రహాసుండు శుకపికశారికాది వివిధవిహంగరుతంబు లాలించి మేల్కాని యాకాసారంబుఁ జేరం డాసి ప్రక్షాళితపాణిపాదవదన గాత్రుండై కొంతవడి అయ్యుద్యానవనరామణీయకంబున కంతరంగంబున నబ్బురపడుచు నశ్వంబు నారోహించి వెడలుడు దక్షిణాంగంబులు చలియించె. మార్గమధ్యంబునఁ గొన్నికొన్ని శుభశకునంబులఁ బొడఁగనుచు నెట్టకేలకు మట్టుమీఱిన నిబ్బరంబున దివసావసానం బయ్యెడితఱి నప్పురిఁ జేరె. తదనంతరంబ దుష్టబుద్ధిభవనంబు డాసి ద్వారబంధపుఁబట్టెయలకు గడపదాఁపున గంధగజపు మస్తంబుల నధిష్ఠించి కొదమసింగంపుగుంపు కదనంబునకుం గాల్ద్రివ్వుచు ఖురంబుల భూతలంబుఁ ద్రవ్వుచుఁ గుంభస్థలంబులను వ్రక్కలించుకైవడి శిల్పికారులచేఁ జిత్రముగాఁ జెక్కఁబడియును, పార్శ్వద్వయస్థితచంద్రకాంత శిలాస్తంభంబులపై వివిధకోమల తరులతా ప్రసూనఫలచిత్రితశిల్పివిశేషంబులు చిత్రింపఁబడియును, దదూర్ధ్వభాగం

బున దారుమయ తురంగ బృందంబు లమర్పంబడి సుమ్మముమునై పునకు ముందటికాళ్లు చాచి విలోకించువారిపైకి దుముకవచ్చునట్లు నిర్మింపఁబడియు నద్భుతావేశముఁ బుట్టించుశిల్పము రమణీయోదంచిత కాంతి పరంపరలచే రాజిల్లుచు నవనవానందంబులఁ గల్పించు రసాలతరుకోమలపత్రతోరణంబు లాస్థానంబున విరాజిల్లునపరంజిపర్ణతోరణంబులచే భాసిల్లుద్వారంబుకడ నిల్చి, పణిహారిం బొడగని తదాగమనవృత్తాంతంబు మదనుని కెఱింగింపు మని నుడివిన నాతఁడు సత్వరంబ తదీయహర్మ్యాగ్రంబునకుం జని దేదీప్యమాన నవరత్నస్థగితంబౌ సింహాసనం బధిష్ఠించి యున్నమదనునిఁ గని ప్రణమిల్లి "దేవా! చందనావతీపతితనూభవుండు భవద్దర్శనాభిలాషియై విచ్చేసి ద్వారంబుకడ నున్నవాఁ" డనెను. అంత నాతఁడు సింహాసనంబు దిగ్గన డిగ్గి యాహ్లాదభరితాంతఃకరణుండై నిమేషమాత్రంబున నాస్థలంబున కరిగి గాఢాలింగనభాగ్య మనుభవించి "మిత్రరత్నమా! యెందుండి యిందులకు వచ్చి యున్నవాఁడవు." అని ప్రణామప్రార్థనాద్యుపచర్యలం బరితుష్టహృదయుం గావించి మధుపర్కాదు లొసంగి యతిథి మందిరంబునకుఁ గొనిపోయి యుచితాసనంబున సమాసీనుం జేసి, తదనుమతంబున నుపవిష్టుండై సమయానుకూలవిహితప్రకారంబుగా మాతాపితృబంధుమిత్రామాత్యాశ్రిత జనంబుల కుశలంబులఁ బ్రశ్నించి, సామ్రాజ్యపరిపాలనాక్రమంబును, సామ్రాజ్యార్థికపరిస్థితులును, చతురంగబలపరిపాలనావిధానంబును విచారించి "మిత్రమా, భవన్ముఖారవిందంబు పొడఁగని మదీయనేత్రంబు లానందంబు నొందుచుండె" నని పొగడి కొంతతడవు సమయోచితసల్లాపంబులఁ బ్రొద్దు బుచ్చి, యాకుమారద్వయంబు, కాలాగురు గంధసారకర్పూరధూపదీపంబుల నెత్తావులు భూనభోంతరంబు వ్యాపింపఁజేసి యించుకవడి లోకరక్షకుండైన శ్రీతరుణీకళత్రుని సేవించి పన్నీట జలకంబు లాడి చీనిచీనాంబరంబుల ధరియించి రత్నకంబళిములపైఁ బద్మాసనంబున నధిష్ఠింప, రాజాంగనలు వడ్డింపఁ దమ్మిపూలచందంబున శ్వేతంబగు రాజాన్నంబును, స్వర్ణచ్ఛాయావిలసితంబగు సూపంబును, సద్యోఘృతంబులును, వడియంబులు, నప్పడంబులు ఫల

రసాయనంబులు పచ్చ ళ్లూరుఁబిండులు, భక్ష్యభోజ్యలేహ్యచోష్యపానీయంబులును నాదిగాఁగల షడ్రసోపేతం బగు విందు నారగించి కర్పూరోదకంబుచేఁ బ్రక్షాళితహస్తులై సుగంధద్రవ్యమిశ్రితం బగు విడియంబుఁ గొని సుఖాసీనులైయున్న తఱిఁ జంద్రహాసుండు దుష్టబుద్ధి యొసంగినకమ్మనొసంగె. తత్సమయంబున జనకముద్రితం బగు తాళపత్రంబుఁ గైకొని "చిరంజీవి తనూభవుం డగుమదనునిఁ గరంబు దీవించి వ్రాసెంచిన స్వస్తివాచనంబు. వత్సా! పద్మకోశస్థితమధు బిందుమాధుర్యంబు మధుకరంబున కాని మండూకంబునకుఁ దేటపడనియట్లు, దుగ్ధాంబుధి భాగ ప్రవీణతమానససరోవిహారమత్తమరాళంబులకే కాని దివాంధంబులకు లేనియట్లు, అనన్య మహీపతుల హితసఖ్యాభిలాషులమై యాత్మనిలయంబున విలయకాలంపుసరీసృపాంగనయుంబలె బుస కొట్టుచు రూక్షవర్తనులమై నభోమణిగోత్రగ్రామణులును, రాజన్యచూడామణులు నగు చందనావతీపురాధిపతుల నిరసించి, యర్థోపార్జనాశాపాశనిబద్ధులమై కప్పంబుఁ గట్టించుకొనుచున్నారము. శ్రీమద్భారత యోషాగర్భశుక్తిముక్తామణియును, సరద్విజ్మండలరాజమండల మకుటమాణిక్యమండితసుందరపదారవిందుండును, దిక్కరేంద్రానేకపకంఠీరవుండును నగుచంద్రహాసుని శక్తిసామర్థ్యంబుల కేను గడుంగడు సంతసించితి. రాజరాజపరమేశ్వరమహేంద్రవైభవంబున సముచితవిధానంబు లాచరింపుము. నావచ్చునంతలో మనంబున నించుకేనియు సందియం బందక విషయ నొసంగి దిక్పాలాద్యమరు లచ్చెరువందునట్లుగా వైవాహికమహోత్సవం బొనర్పు" మని యున్నయవ్వక్కాణంబుఁ బఠియించి ప్రమోదభరితుం డయ్యె.

---

# ప ం చ మ మ ం జ రి

---

అంత మదనుండు నిండారుముదంబున నుప్పొంగుచు "జనకునిపంపున మత్సోదరికి దినకరవంశపారావారసుధాకరుం డగు వరుండు సంఘటిల్లె. మేలు మే" లనుచు మౌహూర్తికులరావించి విచారించి తన్నిశి శుభలగ్నంబు గలుగుటంబట్టి, యవ్వార్త పరిచారకులవలన నాపుటభేదనం బంతటఁ జాటింపించె. పౌరులు తత్పట్టణముఁ బలువిధంబులలం కై సేసిరి. అత్తఱి నప్పురంబుదంచితోన్నతైశ్వర్యలక్ష్మీయుతం బైన యమరావతియునుంబోలె, వివిధాలంకారసుశోభితం బైన ప్రబంధంబును బోలె సకలశిల్పికృతచిత్రస్థగితరత్నం బైన రత్నాకరంబునుంబోలె, తన్మహోత్సవవీక్షణాయత్తమానససురసంచారయోగ్యం బయి కోలాహలమహీధరంబునుఁ బోలె, భాసురం బై మంగళాచారమహిమంబున నుమామహేశనిలయంబునుఁ బోలి యలరారుచుండెను. అతిధవళసుధంబుచేఁ బూత వేయఁబడి వెన్నెలల నెమ్మించు క్రొమ్మించులుం గల సౌధంబులును, రాజిల్లువాడల రేయెండకుఁ బ్రతిఫలించుచు, గోపురంబు నెంచఁదగు గోపురంబులును, నిగ్గుటద్దంబులఁ బలె స్నిగ్ధంబులై యపరంజి మెఱుంగుఁ దాపినచాడ్పున విలసితంబు లగు వేదికలను గలిగి యప్పురంబు నయనోల్లాస మొనర్చుచుండెను. మిన్నేటితరంగములఁబోలు కర్పూరఖండముల నీరాజనధూపంబులు నల్గడల వ్యాపించి ఘ్రాణతోషంబొనర్చుచుండె. చెంగల్వసరంబులు శిరోభాగంబులఁ దేజరిల్లఁ గీలించిరి. ఐదువలు గౌరీపూజ విషయచేఁ జేయించిరి. పురోహితు లత్యంతానురాగంబుతో,

శా. దేవా దీవన లంపి దంపతుల కుద్వేలప్రభావంబు సం
భావింపం దగురీతిఁ బ్రోచి భువిలో భద్రంబులున్ గీర్తులున్

భావాతీతశుభంబులుఙ్ నెఱపి విద్వత్సంచయాశీర్వచ
శ్శ్రీవాల్లభ్యపరంపరల్ గొలుపు మోక్షశ్రీభక్తకల్పద్రుమా.

అని దీవించుచు స్వస్త్యాశీర్వచనంబులఁ బఠియించిరి. వధూవరులను సూర్యచంద్రాదుల నిరసించునాభరణవిశేషంబులచే నలంకృతులఁ జేసిరి. అపరిమితానురాగంబునఁ బాఠకగాయకప్రకటిత శృంగారరసయుత సంగీత నినాదంబులును, దిక్కుడుంగములు ప్రక్కలింపఁజాలుఁ దూర్యఘోషంబులును, నొక్కపెట్టున నుప్పతిల్ల, వందిమాగధస్తవనిర్ఘోషంబులు మిన్నుముట్ట నతివైభవాన్వితంబుగా విషయాచంద్రహాసవైవాహికమహోత్సవంబు ప్రవృత్తం బయ్యె.

అక్కడ దుర్మంత్రి "ఈపాటికిఁ జంద్రహాసుండు కాంతలంబు నకుఁ జనియుండు. మత్సూనుండు క్ష్వేళం బొసంగుటంబట్టి నిహతుం డయి కాలుని గేహంబునకుఁ జనియుండు. మదీయవాంఛలు నిరాఘాటంబుగా నీడేరు. అధికారచిహ్నమై పొరాండు నాయసిపుత్రికకు లోనై యెల్లరాజ పుంగవులు చరియించెదరు. ఆనాఁడు సంయమీంద్రులు పేరోలగంబునఁ బలికినప్రాభవంపువాక్యంబులు పొల్లు గాకుండునే" యని యౌద్ధత్యంబున భండారంబులఁ బాడుఁ జేసి, హాటకసంస్థలు రుత్తుపాడు చేసి మనశ్శల్యంబు వాసి పంటవలంతి దద్దరించుకైవడిఁ బుళిందుని భటసమేతంబుగా జెఱ నిడి బంగరుటరదం బెక్కి రివ్వున నరుగుచుండె. అంతఁ గొంతలోపాంతంబున నొకభూరికృష్ణభుజంగం బద్ధంబుగా వచ్చి మానుషభాషణంబుల నిట్లు వచియించె.

"ఓమంత్రిశేఖరా, నేనిప్పత్తనంబులో బహునిక్షేపంబులు రక్షించు చుంటి. భవదస్తోకరాజ్యంబునకుం బాలకుండు వచ్చె. త్రిశుద్ధిగా నమ్ము. ఇఁక నేఁ బోయివచ్చెద. నమస్కృతు" లని నుడివి రసాతలంబున కరిగె. ఆమహోరగంబు వలికినమాట పాటిఁజేయక తత్పురంబు ప్రవేశించి, చూతకి సలయతోరణాలంకృతంబులును, రంభాస్తంభ సంభృతగేహళీద్వారంబులును,

నీరాజనసందీపితంబును, నగరుధూపవాసితంబులైన రచ్చలు క్రంతలు రాజమార్గంబులును, గోమలసూనవిరాజితనానాలతావేల్లిత చందనమందారాది నానాసుగంధకుజంబులును, గరుడ్వారతోయక్షాళితసౌధోపరి భాగంబులును, వాతతహోమధూమ సంఛాదితసకల దిశామండలంబును, సుందరస్వైరిణీనటనానుకూల శృంగారగీతప్రబంధ వాద్యంబులును, గుందముకుళరాజిత ప్రవాళరంగవల్లికలును, నఖిలశాస్త్రపురాణేతిహాసకథాకర్ణనకౌతూహలాయత్తచిత్తు లగు జనంబులును గలిగి మనోల్లాసజనకం బగు నప్పురిం గని, పట్టణాలంకృతికి హేతు వే మైయుండు నని జనుల నడిగి, విషయాచంద్రహాస వివాహమహోత్సవం బని యెఱింగి, మనంబు చివుక్క మన దటుక్కన నిలయంబుఁ జొచ్చి, "ఆహా! తా నొకటి తలఁచిన దైవ మొకటి తలఁచుఁగదా! హేమాద్రిసంకాశధైర్యస్థైర్య విభాసితుండనై భూపతిగణంబుల నాఖిలవిశాలశౌర్యాగ్నికీలలచే ద్వితీయ ప్రచండప్రభాకరుని చందంబున దగ్ధం బొనర్చి దేదీప్యమానంబు లగుచు విరాజితోన్నత హర్మ్యంబు లగు వారిపట్టణంబుల స్వాధీనపఱచుకొని కప్పంబు గట్టించుకొని యాఖండలవైభవంబున రాజ్యతంత్రోపాయంబుల నెఱపిన యమాత్యపుంగవుండను, చండదోర్దండంబున నుద్దండతరరజతగిరినైనఁ గరతలంబునఁ జెండులీల నాడించి త్రిభువనైకవిఖ్యాతి వహింపఁజాలిన యమాత్యాగ్రగణ్యుండ నగునాకు, కట్టా! యెంతటియవమానంబు సంప్రాప్తించె. విధికృత మలంఘ్యముగదా! ప్రబలపరాక్రమాభిరాము లని లోకంబునఁ బేరుఁ గాంచి పంద లీల నణఁగియుండుట పౌరుషవంతులకుఁ బాడియా! మదీయామాత్యతంత్రోపాయంబున సిద్ధుల బద్ధులగాను, నసాధ్యుల సాధ్యులగానుఁ జేయందొడంగితి. గర్వాంధాహులదర్ప మార్పి మంత్రసమర్థుం డగునాహితుండికునిభంగి నరాతుల ముగ్ధుల నొనర్చితి" అని పండ్లు కొఱుకుచు "నే నేమి లిఖియించితి. వాఁ డేమి యొనరించె" నంచు తనముద్దుల భట్టినిఁ బిలిపించి ప్రళయకాలజీమూతనిర్ఘోషంబుకైవడి, "ఓరీ కుమతీ! చంద్ర

హాసునెడ మైత్రిఁ బాటించి నేఁటికి నాప్రయత్నంబు లన్నింటి భగ్నం బొనరించితివి." అన మదనుండు ముకుళితకరకమలుండై శిరంబు వోడ్చి "జనకా! ఇదిగో భవత్స్వహస్తలిఖితం బైన తాళపత్రం" బని చూపుచుఁ గరంబు బెట్టిదంపువాక్యంబులు పల్కు జనకుని మదనుండు సాదరావలోకం బునం దిలకించి, యంచితదీనోక్తుల "భవల్లిఖితం బగు వార్తావిశేషంబులు శిరంబునఁ దాల్చి దేవరయానతి దాఁటక ప్రాణపదం బైన ముద్దులచెలియలిని నే నాతని కొసంగితి" నని పల్కఁ దనయునిభాషితం బనృతం బని విశ్వ సింపక క్రోధవిలోకనంబు లతనిపైఁ బ్రసారించుచు విధురునిక్రియఁ బరి తపించుచున్నంత నాకొమరుప్రాయంపుదంపతులు చీనిచీనాంబరధారులై యరిగి దుష్టబుద్ధినిం గనుఁగొని సాష్టాంగదండప్రణామంబు లాచరింపఁ గైత వంబుగా "సకలకళ్యాణమస్తు సుశాంతిర" స్తనుచు బహువిధంబుల నాశీర్వదించెను. కాని చంద్రహాసునిదెస ననూయాపరుండై క్రోధంబును గప్పి పుచ్చి, కర్తవ్యాంశములు ముచ్చటింప నిచ్చ జనింపక కఠినపాషాణతతు లతోఁ బొడిచిన ట్లుండి సారంగకిశోరముఁ గాంచినకొదమసింగంబుభాతి క్రోధోద్దీపితమానసుం డగుచు మానసోద్భూతభావంబులఁ గప్పిపుచ్చి కప టోపచారంబుల నెట్టేటులో నాకబలితంత్రంబు నడిపించె.

దుష్టబుద్ధియు నానిశి శయ్యపైఁ బవ్వళించినను నిదురఁ బట్టక యాతనియత్నంబులు వమ్మయ్యె నని వగలం బొగులుచు, మఱునాఁటిప్రభా తంబున డెందంబున నున్మాదంబు మెండుకొన "క్షీరపారావారంబున హాలా హలంబుభంగి మద్వంశంబున నాపుత్రీపుత్త్రు లుద్భవించిరి. ఇఁక చంద్ర హాసుం డెచ్చరికపడియె నేని మేటిముప్పు వాటిల్లు. నే నెత్తెఱంగున నైన నీతులువను వధించి బ్రహ్మణ్యులవాక్యంబు లబద్ధము జేసెద" నని సుస్థిరమన స్కుండై బ్రహ్మఘ్నుండు, గోఘ్నుండు, పితృఘ్నుండు, మిత్రఘ్నుండు, యజ్ఞఘ్నుండు, శిశుఘ్నుండు, గురుఘ్నుండు, మాతృఘ్నుండు, స్త్రీఘ్నుండు, బంధుఘ్నుం డనంబరఁగు నంత్యజులఁ బదుగుర రావించి రోషారుణితనేత్రుండై

కఱకుటమ్ముగలఁబోలెఁ దీక్ష్ణంబులై, హరిహర నీరజాసనాదుల వక్షంబు లునైతము బ్రద్దలౌనట్లు వినువారిహృదయపుటభేదనంబు సేయఁజాలు భీషణంబులగు నార్భటులతో, "ఓరీ, నే నానాఁడు మీకు శాసించిన వాక్యంబు లన్నియు జంబాలపటలంబున గల్పుటంబట్టి వాచంయముల ప్రాభవంపుఁ బలుకు లిప్పుడు మహాపాదపములై ఫలభరితము లయ్యె. కాన నేఁటి కేని నాయాన మీరక పరశుహస్తులై చండికాధామంబున దాఁగియుండుఁడి. విద్వేషుండైన వీని నీఁకనైనను దుదముట్టించి నాహృదయశల్యంబు వాపుఁడు. ఆజానేయం బధిష్ఠించి యెల్లి సంధ్యాకాలంబునఁ గాళీపూజామిషంబున నేకాకియై వచ్చువానిం బట్టి వెనుకముం దాడక రెండు తుండెములుగా నేయుఁడు. మీరలు విప్రతిపన్నులు గాక కఠినమనస్కులై వేగంబ చని భవాన్యాలయప్రాంతంబున దాఁగియుండుఁడు. ఇత్తెఱంగు నెఱవేర్చితిరేని మదీయసామ్రాజ్యంబున నర్ధభాగం బొసంగెద. సమస్తభోగంబులందు మీకు భాగ మిచ్చెద. మత్ప్రియతనయుం డగు మదనునితోడు" అని చెప్ప నాచండాలురు వివృతవదనగహ్వరు లయి తత్క్షణమే సానఁదీసిననిశిత భల్లంబులఁ జేఁ బూని సీధుపానమదోన్మత్తులై ఘోరాఘ మని మదిఁ దలంపక దుష్టబుద్ధి పాదవిన్యస్తమానసులై చిందు లాడుచు నభిజిత్కాలంబునకే కాళీమందిరంబునకుం జనియుండిరి. అంత దుష్టబుద్ధి చంద్రహాసుం గని, "వత్సా! ఆదికాలంబునుండి మద్వంశాచారం బొండు గలదు. శోభన పరంపరాప్రాప్తికయి మద్గృహంబునఁ బెండిలి యైన నూత్నవరులు చండ్యాలయంబున కేకతంబ యేఁగి యుపహారంబు లర్పింపవలయు. కాన యెల్లి సంధ్యాసమయంబునఁ బురసామీప్యంబున నున్న శాంభవ్యాలయమునకుం జని, పూజింపు" మని కౌటిల్యంబుఁ గప్పిపుచ్చి వైదగ్ధ్యంబునఁ జెప్పఁ దదాచార ధర్మంబు బాలించి సంతుష్టాంతరంగుండై ప్రలంభ మెఱుంగనేరక వల్లెయనె.

ఇట్లుండ నటఁ గౌంతలమహీనాథుఁడు నిజశరీరపతనారిష్టంబులఁ గని దానిభావంబుఁ దెలియంగోరి ప్రాజ్ఞుండై పురోహితుండునగు గాలవుని

శావించి మొగంబున నైవర్ణ్యంబుఁ దోఁపఁ బ్రణామంబున, "మునికులసత్తమా! నాతనుచ్ఛాయ మస్తకము లేక కాన్పించె. ఇయ్యది యరిష్టం బయియుండు. ఇఁక సామ్రాజ్యకాంక్షలు దొఱంగితి. భగవన్నామస్మరణమందు మెలంగఁ గోరెద. అయ్యరిష్టచిహ్నంబులు వినంగోరెద. తెలియఁబలుకు" మనవుఁడు నాగాలవుం డిట్లు చెప్పందొడంగె.

## అరిష్టలక్షణములు

"పార్థివేంద్రా! దత్తాత్రేయుండు మున్నలర్కునకు నేతెఱంగెఱింగించె. నీకు మదీయమేధావిశేషంబునఁ జిత్తంబునకు సమాధానము గల్గునట్లుగాఁ దత్క్రమంబుఁ దెలిపెద. సావధానంబుగా నాకర్ణింపుము. ధ్రువవసిష్ఠారుంధతులఁ గాంచిన నగోచరంబై తెలియకుండిన నట్టిమానవునకు వత్సరంబులోపల నాయువు పూర్ణమగును. సూర్యమండలము కిరణరహితంబుగాఁ గన్పట్టు నఖివిషునకుఁ బదునొకండునెలలలోపల మరణము ధ్రువము. ఒక్కనాఁడు బలసినను బలిష్ఠుఁడై యుండి యాకస్మికముగ బక్కఁజిక్కిన నష్టమాసంబులలోపలను, నడుచునప్పు డడుగులజాడలు విఖండితంబులైనట్లు పొడగట్టినవానికి సప్తమాసంబులలోపలను, వాయసగృధ్రదివాంధములు శిరంబు స్పృశించెనేని షణ్మాసంబులలోపలను, అభ్యంజనసమయంబునఁ గాయపు చర్మం బదరెనేని నైదునెలలలోపలను, అంతకుని దిక్కున నిర్మేఘంబైనగగనంబున విద్యుల్లత కనఁబడెనేని మాసత్రయంబునను, తనప్రతిబింబ మన్యవిధంబున నుండెనేని చతుర్మాసంబులలోపలను, దదాకారము ముకురంబున విధ్వస్తమస్తకంబై కానఁబడియెనేని మాసద్వయంబులోపలనుఁ దనశరీరంబున నిర్నిమిత్తంబుగా శవగంధమాఘ్రాణింపఁగలిగెనేనిఁ బక్షంబులోపలను, స్నానంబుఁ జేసినతడి తోడన యారెనేనియు, నీరముఁ గ్రోలిన దాహేచ్ఛ శమింపదేనియు రభసంబున యమసదనమునకు వేంచేయుట నిశ్చయంబు. మానుషకనీనికాయుగ్మంబులలోఁ దనవిగ్రహము గానరాదేని, గర్ణపుటంబులలో నంగుళులు సొనిపిన

యెడలఁ బ్రాణఘోషంబు వినఁబడదేని క్షణమాత్రంబుననే శరీరహాని సంభవించు. తననీడను దాను భక్షణము చేయుచున్నట్లును, నరాళంబులైన కుంతలజాలంబులు, నుముకయుఁ దినినయట్లును, వస్త్రహీనుం డైన క్షపణకుఁడు చిఱునగవు దళుకొత్తఁ జెంత గంతులు వైచినట్లును, నాపాదశిరంబు పరిమళతైలంబు నలమికొని ధారుణిఁ గూలి సుప్తిఁ జెందినయట్లును, భయంకరాకారులై బంట్రౌతులు వెనువెంట నంటినట్లును, దండముతోఁ గాని, గుదియలతోఁ గాని పొడిచినట్లును, శ్యామలవృషలుఁడు తరిమి కర్కశపాషాణములు వ్రేయునట్లును, నీలిచీరె ధరియించుకొనిన యొక్క యలినీలాలక దక్షిణాభిముఖంబుగాఁ బోవ దానివెంబడిఁ బోవునట్లును స్వప్నము గన్న వారికి మరణంబు ధ్రువంబు. కావున నరపాలా! యరిష్టంబులు సంభవించినప్పుడు ప్రాలమున్నీటియల్లునిఁ బ్రార్థించుచు హవ్యముఖంబున సురార్చనాదులు పైతృకకార్యంబుల నొనర్చిన, ననయశారీరకభోగ సౌకర్యములు నిరసించి యింద్రియవికారంబులు జయించి హరితత్త్వబోధ లెఱుంగుచు పరబ్రహ్మంబు గాంచినసత్పురుషుఁబోలె నాపదలఁ దరియింపఁగలరు. శుభము నేకూరుగాఁత, నే నరిగెద" నని సెలవుఁ గైకొని గాలవుం డరిగె. ఆపలుకు లాకర్ణించి తాపత్రయము లడఁచి ముకుళితనేత్రుండై కుబుసంబు నూడ్చు మహోరగము తెఱంగున నైహికవాంఛల విడిచి యింకేమియుఁ జేయఁ దలఁపు దట్టక పుత్త్రికా వివాహభారంబు తొలంగినతోడన రాజ్యభోగంబు విడువం దలంచి, వివాహసమయంబునఁ జంద్రహాసుఁ గాంచి యాతనిశౌర్య ప్రతాపంబుల వీను లలర విని యాతండ తనకుఁ దగినజామాత యని మనంబున మున్న నిశ్చయించి యున్నవాఁ డగుటను, మంత్రితనయుం డయిన మదనునిఁ బిలిపించిన, నాతఁడు చివ్వున భూజానిపొంత కేతెంచి దండంబు లర్పించి "కతం బేమియో వచియింపుడు. అయ్యది యేను నెఱవేర్చెద" ననవుడు నాభూవల్లభుండు "అమాత్యతనయా! చంద్రహాసుని వేగంబ గొనితెమ్ము. మదీయదుహిత యగు చంపకమాలినినిఁ జంద్రహాసుని కిడి పరిణయం బొనర్చి రాజ్యభారం బాతనివశం బొనర్చి, తపంబున కరుగవలయు" నన, నయ్యవసరంబ మదనుండు సెలవు గైకొని యతిత్వరితంబ తన్నిలయంబునకుం జనియె.

# ష ష్ఠ మ ం జ రి

---

అంత దివసావసానం బగుటయు సప్తాశ్వుండు నిజాన్వయాంభోధిపూర్ణిమాచంద్రుండగును, సతతకల్యాణాలంకరిష్ణుండు సతతసత్యవర్ధిష్ణుండును, ననల్పతరసుఖభాజనుండగు నైన చంద్రహాసుండు తంత్రంబు లెఱుంగక దీర్ఘప్రసుప్తుం డౌట కరుగుచున్నాఁ డని దివ్యదృష్టిచే విలోకించి కళవళించి, పాతాళవాసుల కెఱింగించి తదీయనిష్పచ్ఛర్ధపుస్థితిఁ బాప నరికట్టి నిస్తంద్రుండై యరిగెనునో యనఁ జరమగిరితటంబునకుం దిగంబాఱె. మిహిరుని వలనఁ దద్వార్త యెఱింగి యద్భుతవిషాదంబులఁ బెనంగొన శూరశిఖామణి యగు చంద్రహాసు నీక్షింపవలయు నని సారథులు గని వచ్చుమారుతాశన మౌళిభాగంబునం బ్రజ్వరిల్లు పద్మరాగమణిప్రభలు చెన్నారుచుండఁ దద్రుచులపై గగనయోషామతల్లి జిలుగుఁజెంగావిచీరెను దాల్చెనో యన సంధ్యారాగ మెల్లెడల వ్యాపించె. అంతఁ జంద్రహాసుండు కృతనిశ్చయుండై యుత్తమాశ్వంబు నెక్కి యర్ఘ్యపాద్యాద్యుపచారములకు వలయు వస్తువ్రాతంబులఁ గొని, నీశ్వరీనామధేయంబులఁ గీర్తింప నిచ్చ వొడమి నిష్ఠాగరిష్ఠుండై యీషణత్రయంబున కొగ్గక సంతుష్టుండై మామనాజ్ఞకుఁ బ్రహృష్టుండై పట్టణంబునుండి పయనం బయి యేకతంబుగాఁ బోవునట్టి మఱంది నవలోకించి మదనుండు మ్రొక్కి "బావా! కౌంతలేశ్వరుఁడు పేరోలగంబుండి యీక్షణంబ నిన్నుం దోడ్తెమ్మనె" నవుడు నాతండు "మీజనకుని పంపున శైలతనయాలయంబునకుం బూజాద్రవ్యంబులఁ గొని యరుగుచున్నాఁడను. ఆజ్ఞ దాఁటి వర్తించుట ధర్మంబు గాదు. కాన, నిఖిలలోకప్రభుసతి యగు భద్రభవనంబున కతిత్వరితంబె విచ్చేసి యుపహారంబు లర్పించి సేవించి వచ్చిన మీఁదట నవ్విభునిమందిరమున కరిగి రాజదర్శనం

బొనర్తము." నావుడు మదనుండు బ్రహ్మానందంబున "నింతటిపాటిపని యేనొక్కనిమేషకాలంబుననే నీకు బనులు చేయంగలాఁడ. నీవు రాజాధిరాజనిలయంబున కరుగుము. నేను పన్నగభూషణుపడఁతిగృహంబున కరుగువాఁడ" నని యాతనిహస్తగతంబు లైన గంధపుష్పాక్షతాదిపూజాద్రవ్యంబులఁ గైకొని యాతఁ డధిష్ఠించియున్న యశ్వం బెక్కి వివిధమణిప్రభామండితంబు లైన ఛత్రచామరాదు లాతని కిడి పంపెను. భగవద్భక్తిపరాయణుండును, ధర్మకార్యములకై పాటుపడెడివాఁడును, ద్విజసంతృప్తికై సత్ప్రవర్తనతో మెలంగువాఁడును, నిఖిలవిద్వద్గణపోషణలోలుండును, నిరుపమానందభరితుండు నగు చంద్రహాసుండు వినయాదిగుణసంపన్నుఁడై సత్వరంబుగాఁ జని ప్రణమిల్లి నిలుచుటయుఁ, గుంతలభూనాథుండు దిగ్గన గద్దియ డిగి పరంపరాభివృద్ధి యగునట్లు దీవించి మంత్రి నాహ్వానించి తత్సమక్షంబున మహోత్సవంబుతో వందిమాగధసందోహంబులు కైవారంబులఁ జేయఁ బీఠంబుపై నునిచి గాలవఋషిపుంగవుని శాసనం బతిక్రమింపక బ్రాహ్మణుల రావించి, తద్భక్తాగ్రేసరుని కాహ్లాదంబునఁ గరుణాపరిపూర్ణహృత్కమలంబునఁ జంద్రికాచ్ఛాయలో యన్నట్లు మవ్వంపుముగ్గులతో నలంకరించి చంద్రహాసునకుం జంపకమాలిని నొసఁగి మహావైభవముతోఁ, బరిణయంబుఁ జేసి తన పసిండి గద్దియ నాతని నునిచి పట్టంబుఁ గట్టి సమస్తసామ్రాజ్యవైభవంబు లొసంగె.

అయ్యవసరంబున మదనుండు నిర్భరానందపులకితాంగుఁ డగుచు భక్తిపరవశుండై, నగరప్రాంతంబున నున్న రుద్రాణీసదనంబునకుం జనుచుండ నమ్మహాధ్వాంతంబున వేల్పుఁబెద్దరాణియాలయంబున కిరుగడలఁ దీక్ష్ణశూలహస్తంబుల ధరించి వలయంబుగాఁ ద్రిప్పుచు దిరుగాడు చండాలురు మదనునిఁ బట్టుకొని యప్రతర్కితవీరరసప్రధానులై పయిం బడి వేయివ్రయ్యలుగా ఖండించి నేలం బడవైచిరి.

కట్టా! జనకు లొనర్చిన దుష్కృత్యములు తరతరములవఱకు బిడ్డ లనుభవింపక తీర దన్న వృద్ధులవాక్యం బనృతంబు గాదు. సంఫుల్లమల్లీలతాప్రసవ

సుచ్ఛపరిమళోదారసౌభాగ్యవిలసితం బగు మండపమధ్యంబున చంద్రకాంతశిలానిర్మితవేదియందు నిండారు సమ్మోదంబునఁ జెలంగుచు మేలుకట్లునుండి వ్రేలు ముత్యాలపేరులు గగనలక్ష్మీకంధరతటినుండి వ్రేలాడెనో యన్నట్లు చూపఱులకుం బ్రమోదంబు నొసంగుచు మహావైభవంబునఁ జంద్రహాసుండు చంపకమాలినిఁ బెండిలియాడి కాంతలసామ్రాజ్య సింహాసనారోహణంబున మహోత్సవంబు నంది శచీసమేతుండైన రెండవయాఖండలునిఁబోలి శుభానందపరంపరలతోఁ జంపకమాలినీసమేతుండై విరాజిల్లుచుండె.

అంత నిశీథసమయంబున మరుదంకురములు జనుల కాహ్లాదము గలిగించుచు నెల్లయెడల మెల్లగా వీచుచుండె. నింగివిభాసితతారకావళి పుడమిపై రాలెనో యన్నట్లు జ్యోతిరింగణము లక్కడక్కడ మినుకుమినుకుమని ప్రకాశించుచుండె. అంతఁ గుటిలస్వభావుం డగు దుష్టబుద్ధి తనతంత్రంబు లన్నియు విఫలంబు లగుటయుఁ, బైపైఁ జంద్రహాసునకుఁ గల్యాణపరంపరలు సేకూరుటఁ గాంచి తనయందు దైవంబు విముఖం బగుట కెంతయు వగచుచు, మనంబున దహతహ వొడమ తాఁ బంపినకిరాతులరాకకై వేఁచియుండె. ఇంతలో నక్కిరాతు లేగుఁదెంచి యమాత్యవర్యునకు జోహారు లొనర్చి యిట్లు విన్నవించిరి. "ఏకిమీఁడా? నీయానఁ దలఁ దాల్చి మే మాకాళికాలయంబున వేఁచియుండ సంజప్రొద్దువేళ నొక్కవయసుకాఁ డెవ్వండో పూజాద్రవ్యంబులఁ బళ్లెరంబున నిడుకొని శిరంబున మోయుచు, నద్దేవిని సేవింప నరుగుదెంచెను. సంజచీఁకటి యగుటచే మే మాతని గుర్తింపలేకపోతిమి. కాని మీముదలఁ దీర్చుటయే మాపని గావున నొక్కవ్రేటున నాతనితల నేలఁ గూల ఖండించితిమి. రక్తప్రవాహంబుచే గుడిముంగిలి యంతయు నిండిపోయెను. మీఁద దేవరచిత్తము, మాభాగ్యము" అనుటయు నాదుష్టబుద్ధి మనంబు తత్తరపాటుఁ జెంద, నక్కుమారుఁ డెవ్వం డయి యుండనోపు నని సందేహంబు వొడముటయు రేయి చాలప్రొద్దైనను, మదనుఁ డింటికి రామియు నన్నియు జతపూర్చుకొని యోజింప మనంబున

నేదియో భయంబు దోఁచె. గుండెలు తటతటలాడె. కాళ్లు చలించిపోయె. కన్నులు పచ్చనయ్యె, శరీర మంతయు స్వేదావృతం బయ్యె. వాక్కు స్తంభించిపోయె. ఇట్లొక్కముహూర్తమాత్రంబు నిశ్చేష్టితుఁ డయియుండి యెవ్వరితో నేమియుఁ జెప్పక కరవాలంబుఁ జేఁ బూని యొంటిగఁ దన్ని శీథవేళ భవాన్యాలయాభిముఖుం డయ్యె. తుదకు రుద్రాణ్యాలయంబునకుం జేరుకొనెను. తదాలయంబున దీపంబులవెలుఁగు లేక నిశ్శబ్దముగా నుండెను. ఆతురితమనస్కుం డైనందున నంధకారం బనినైతము భయోద్భ్రాంతుండు గాక యందుఁ బ్రవేశించి భూమిపై నెమకగా నాతనికిఁ దనయుని కుణపమును, నించుక దాఁపున శోణితమగ్నం బై నమస్తకంబునుం గాంచి యంగారశిలాసాహాయ్యంబున వెలుఁగుఁ గలిగించి పరిశీలింపఁ దనతనయుని మస్తకగాత్రంబులు దృగ్గోచరంబు లయ్యె. అంత దుర్మంత్రి ఝంఝూమారుతవేగంబున భగ్నం బగుమహావృక్షంబుకైవడి నేలపైఁ బడి శోకదందహ్యమానమానసుం డగుచు, విచ్ఛిన్నశీర్షం డైనపుత్రునిదురవస్థయుఁ, దానొనర్చిన తంత్రోపాయంబును,నాత్మగతంబునఁ దలంచుచు, బిట్టు రోదనంబుఁ జేయుచు నిట్లు విలపించె. "కట్టా! యెంతటిముప్పు వాటిల్లె. ఇంక నేనేమి చేయువాఁడ? దరి తోఁచదయ్యె. తంత్రోపాయంబుచే మదనుని సార్వభౌముగాఁ జేయవలయునన్న మదీయజతనంబు విరుద్ధముగా ఫలించె. మునులవాక్యంబులే సంసిద్ధంబులయ్యె. శ్రీవిష్ణుభక్తునకు ద్రోహంబుఁ జేయఁ దలంచిన పాపాత్ముల యత్నంబులు ఫలించునే. ఇంకఁ బ్రోలు కరిగి ప్రజల నెట్లు జూతును? కుంతలనాథుని నెట్లు కన్గొందును. చంద్రహాసనరేంద్రునిముఖం బెట్లు చూడఁగలను? చూచుటకంటె స్వయముగాఁ బ్రాణంబులఁ బాయుటయే పాడి. మంత్రిపుంగవుండ నని మిక్కుట మగు నాగ్రహస్వభావంబునఁ గార్యాకార్యంబులు కాని, అమిత్రోదాసీనులను గాని పాటింపక యరిషడ్వర్గముచేఁ బట్టువడి యింతటి కుత్సితకార్యంబుఁ గావించితి. చంద్రహాసుని నామం బనామకంబై నశించుటకుఁ దగిన యేర్పాట్లు చేసితిఁ గాని నీరము శుక్తిలోఁ బడి ముక్తామణిత్వముఁ దాల్చుక్రియ సంఘటిల్లె? పైఁబయిఁ

జంద్రహాసుండె ప్రభు వయ్యె. తంత్ర మతఁ డించుకంతయేని నెఱింగినచో నామానప్రాణంబులు దక్కునె. లోకంబున నియ్యగడిఁ బొందుటకన్న బలవన్మరణమే శ్రేయస్కరము." అని కొంతవడి వగచి ప్రాణప్రదం బైన పుత్త్రరత్నం బెడఁబాయఁగా నే నెందుల కిఁక జీవించుట యని, యద్దేవీ మూర్తిని మనంబున ధ్యానించి సకలేంద్రియవ్యాపారంబుల నుజ్జగించి, నిశ్చలమనస్కుండై యాత్మఖడ్గప్రహారంబున ఖండితమస్తకుం డయి నేల వ్రాలె. నాఁటివేఁకువ దుర్గామందిరంబునకుఁ బూజారి విహితప్రకారంబున దివ్యసుగంధప్రసూన మాల్యాంబరాదులఁ గైకొని యరిగి వాకిట భగ్నశిరస్కులై పడియున్న తండ్రికొడుకుల కుణపద్వయంబుఁ దిలకించి వక్షంబు మోఁదుకొనుచు లోకత్రయవిఖ్యాతామాత్యకళానిపుణు లైన వీరుల నెవరు పరిమార్చిరి. లుబ్ధులై పరవిత్తమునకుఁ బాలువడు భూమీశగణంబుల కైన నమాత్యుల కైన నింక నేరి కైనను నెప్పటి కైనఁ బ్రాణంబులపోక దాఁట రానిదిగదా! "జాతస్య మరణం ధ్రువమ్మ"ను పలు కెన్నటికేని పొల్లగునే" యని పరిపరివిధంబులఁ జింతించి యవ్వార్త తేని కెఱింగింపకుంట యపాయంబు గాన శీఘ్రగమనంబున విషయాచంపకమాలినీసమేతుండై యున్న చంద్రహాసుని సమ్ముఖంబునకుం జని జరిగినవృత్తాంతం బెఱింగించె. అంత నాతఁడు త్రుళ్లిపడి హంసతూలికాతల్పంబునుండి డిగ్గి విషయాచంపకమాలినుల నందు నిలువ నియోగించి అనుతాపమును జాలియును బట్టఁజాలక తత్తరంపుఁ బలుకులతో నాతనితో భాషించుచుఁ బాదరక్షలు గాని తలపాగగాని ప్రేపబెత్తంబు గాని ధరింపక యశ్వారూఢుఁడును గాక పాదచారియై యామాన్యులగుణగణంబులఁ దలపోయుచుఁ జేరంబోయె. రాజును రాజకీయోద్యోగులును, పౌరులును, దన్ను వెంటాడి దేవళంబుకడకుం జేరఁ జనిరి.

అతఁ డట్లు రుద్రాణ్యాలయంబుఁ దరియం జని యందు, విగతప్రాణులై పడియున్న దుర్మంత్రిమదనులం గని శోకసంతప్తమానసుండై

“ యమాత్యతంత్రంబునఁ ద్రిభువనాధీశుం డనంజాలు నీతని దోర్గర్వవిభవం బున దీపించువీరిపై నేవైరి దృష్టి నిలిపి ఖండితశిరస్కులం గావించె.

ఆహా! లోకంబున వీరిప్రాణంబులు మదీయ మేధాశక్తిని మరల్పక పోయితినేని లోకంబున నన్నుఁ బ్రబలమంబునఁ జేపట్టి యీ మహోన్నత పదవికి నర్హునిఁగాఁ జేసినబుణం బెట్లీఁగనోపుదు.

వీరిచే నున్నతపదవికిఁ దేఁబడిన యీకాయంబు వీరికై యుపయోగింప నేనిఁ గృతఘ్నుం డని నన్ను లోకంబు ద్రువ్వఁదిట్టు. ఎబ్బంగినైన వీరిని రక్షింపవలయును. తొల్లింటికర్మఫల మెవ్వరి కైన ననుభవింపక తీరదు గదా? మున్మిత్రుఁ డొనర్చిన సత్కార్యవినయవిధేయతలు కడు శ్లాఘ నీయములుగదా. ఆహా! ప్రాణికి స్నేహంబుకంటె, వేఱొండుత్తమపదార్థం బిమ్మేదినిం గలదే.

సీ. “ అతిరహస్యంపుసంగతికిఁ దాళపుఁజెట్టె
మంచిచెడ్డలకుఁ జూపించుత్రోవ
కాలయాపనకుఁ జక్కనియుపాయం బమి
త్రధ్వంసమునకు ఫిరంగిగుండు
ఘనకార్యములకుఁ బెట్టినపేరు దారిద్ర్య
భంజనమునకుఁ దుపాకిదెబ్బ
యాపన్నివారణ కౌషధప్రాయమ్ము
తులలేని సుఖదుఃఖములకుఁ ద్రాసు

గీ. ఆత్మసంరక్షణమునకి మ్మైనకోట
సంశయమ్మునకు వినాశసమయ మరయ
సకలలోకోపకారంబు సలుపఁగలుగు
మైత్రికన్నను వేఱొండు మహినిఁ గలదె. ”

అని కొంతవడిఁ బొగిలి పార్వతీదేవిని స్తుతింప నెంచి, "సకలలోకపావనీ; భక్తజనసంత్రాణదీక్షాపరాయణీ; ఓజగన్మాతా; నారాయణీ; తల్లీ; నీభక్తునియెడఁ బూర్ణానుగ్రహ ముండిన వీరిని బ్రతికించి నన్ను సఫలీకృతమనోరథుఁ జేయుము." అని తదేకధ్యానంబునఁ గళత్రద్వయంబును బౌరులను మఱచి భజియింపందొడంగె. కాని చంద్రహాసునకు లాభము లేకపోయెను. రుద్రాణిసన్నిధియందే హోమకుండంబులఁ ద్రవ్వించి, యందు పావకమూర్తిని బ్రజ్వలింపంజేయుచు నిష్కళంకహృదయంబున హోమమందు శర్కరాతిలపాయసఘృతంబుల వేల్చి యగ్నికుండముచుట్టుఁ దిరుగుచుండె. 'ఓరక్తప్రియా! సర్వశక్తి! రక్తాక్షి! బలిదానవినోదినీ! ఓదేవీ! ఇదే చూడుము. రుధిరపూరితము లగు నాయవయవముల నీకొఱకు హోమము చేయుచున్నాను. నీకంతతో సంతుష్టి కలుగదేని నామస్తకము, నీకు బలిగా నొసంగువాఁడ" నని యావేశంబున నొడ లెఱుంగక పలుకుచు నాతని మేని పలలఖండంబు లందు వేల్చుచుఁ బండితజేగీయమానంబుగ సగరుని మున్మనుమని కైవడి నేకపదంబుమీఁద నిలువంబడి, తల్లీ! లోకంబున నద్భుతభయసంజనక మగు సంసారసాగరంబునం బడి ప్రాల్మాలుచు మనోవ్యథచేఁ గుందు మాబోఁటి తుచ్ఛప్రాణు లెల్లరు త్రిలోకపావని వగు నీపదపంకజమధువు గ్రోలకయే, తమోనివృత్తు లెట్లగుదురు. భవదద్భుతశక్తిఁ బొగడ నేరికిఁ దరము. నమ్మిన నీభక్తుల ప్రార్థన నాలకించి రక్షించెడిదానవు. జగన్మాతా! భగవతీ! నామొర నాలకించి మంత్రిని నాతని తనూభవుని బ్రదకింపుము." అని స్తుతించె. కౌంతలేశ్వరుఁడును, పురజనులును, నాతనియుద్యమమునుండి మఱలింప నెన్నోవిధంబులఁ బ్రయత్నించిరి. దుష్టబుద్ధిదుర్గుణంబులును, ఆతఁడు చంద్రహాసునెడఁ జేసినకృత్రిమకార్యంబులు మఱిమఱి యుగ్గడించి యాతనిమనసునఁ గ్రోధము నెలకొల్పఁ జూచిరి. కాని నిశ్చలమానసుండును, ధైర్యనిధియుఁ గరుణాళుండు నగు చంద్రహాసునికడ వారిపన్నాగములు కొనసాగవయ్యె. అంతఃపురకాంతలును, మహారాణులు నగు విషయా

చంపకమాలిను లీవార్త విని యెట్లైన నాతని యత్నంబునుండి విముఖుం జేయ నచ్చోఁ జేరవచ్చి యెన్నోవిధంబుల వేఁడిరి గాని వారలయత్నంబులును గొన సాగవయ్యె.

చంద్రహాసునివిజయధ్వజమువలె నాతనిహృదంతరాళముకూడ చలనముగలదికా దని యందఱు నెఱుంగుదురు. రాణు లిప్పు డేమి చేయవలసినది? భయవికారములచేఁ గలఁత నొందుచు దీర్ఘశోకానలంబుచేఁ దప్తు లగుచు నిశ్చేష్టలై పడియుండిరి. చంద్రహాసుఁ డొనర్చుకఠినవ్రతమునకు బ్రజలహృదయములు తల్లడిల్లుచుండె. చంద్రహాసుఁ డందుఁ బడి యాహుతి కావలయు నని నిశ్చయించుకొనెను. ప్రజలహాహాకారములచేఁ బత్తన మంతయు నల్లకల్లోల మైయుండెను. తనతనూజను రాజ్యసహితముగ నొసంగిన కుంతలప్రభుం డిప్పు డీలోకంబున లేనట్లుండి జీవచ్ఛవముగాఁ బడియుండె. ప్రజలప్రాణము లెక్కడికో పోయి వారికళేబరములుమాత్ర మట నున్నవి. ఎంతటికిఁ గార్యసాఫల్యము గాక ధైర్య మవలంబించి, కరవాలంబు ఝళిపించి యాత్మరక్షణపరాయణుండు గాక, 'శిబేరివ సముద్భూతం శరణాగతరక్షయా, సంచీయతే త్వయా సాధో యశో హి సుహృదా వినా' అని యాత్మగతంబున ప్రశంసించుకొని యాత్మహత్య చేయ నుంకించుతఱి న్యాయపరిపాలనకర్త యగు హరిశ్చంద్రనరేంద్రుఁ డనృతం బాడ నొడంబడక కులసతినిఁ దెగటార్పఁబోవునపుడు గాధిపట్టి తపోమాహాత్మ్యంబున హఠాత్తుగాఁ బ్రత్యక్షంబై రక్షించినతెఱంగున, నద్దేవీమూర్తి యిందీవరశ్యామయు, చతుర్భుజసమన్వితయుఁ జతుర్బాహువుల వీణాపుస్తకలీలాకహ్లారేక్షుదండధారిణియు, ననంగజనకాపాంగవీక్షణయు, శరచ్చాంపేయపుష్పాభనాసాదండవిరాజితయు, లసత్కాంచనతాటంకయుగళయు, మణిదర్పణసంకాశకపోలయుఁ, దాంబూలపూరితస్మేరవదనయు నగుచుఁ గట్టెదుట దృగ్గోచరంబయ్యె. అంతఁ జంద్రహాసుండు భక్తిపారవశ్యంబున నమ్మూర్తిం దిలకింప శరీరంబు పరవశత్వంబు నొందె. ఆనందబాష్పంబు లెడతెగక ప్రవహింపఁ

దొడంగె. అతండు సర్వాంగాలింగితభూతలుం డయి యద్దేవి నిట్లని స్తుతింపఁ దొడంగె. "హేమాతః, సకలదురితనిర్మూలినీ; దుర్గే; లీలాలోలితభర్గే; మాం పాహి మాం రక్ష; శాంకరీ; సకలజనపాపక్షయంకరీ! భక్తజనవశంకరీ; న న్నీయాపదనుండి యుద్ధరింపుము. నాయీబంధువుల బ్రదికింపుము. నీయీ భక్తుని వంచింపకుము." చంద్రహాసుం డిట్లు పరిపరివిధంబుల స్తుతించుచుండ, నద్దేవి యాతనిఁ దనవామకరంబున లేవనెత్తి దక్షిణకరంబున నాతనిశిరంబు నిమురుచు, "వత్సా; చంద్రహాసా; భయంబు చెందకుము. భవద్భక్తి సాహసంబులకుఁ గడు సంతసించితి. భయము చెందకుము. నీయార్తిఁ బాపెద. మద్భక్తు లెన్నండును విఫలమనోరథులు గారు. నీయీబంధుసులు సజీవు లగు దురుగాత. నీ కింకను వరంబు లొసంగ నామనం బుత్సహించుచున్నయది. నీవు సకలజనసమ్మోదకరంబుగఁ జిరకాలముఁ బ్రజాపరిపాలన మొనర్పుము. నీవంశంబు లోకంబునఁ జిరస్థాయిగా వర్ధిల్లు. నీకీర్తి యాచంద్రతారకం బగుఁ గాత. మద్భక్తుల కెల్ల నీ వాదర్శకపురుషుండవు కమ్ము. ఏఁబదికోట్ల యోజనవిస్తీర్ణం బైన భూవలయం బేకచ్ఛత్రంబుగాఁ బరిపాలింపఁగల బల పరాక్రమసమున్నతి సంపన్ను లైన పుత్త్రిరత్నద్వయంబుగూడఁ గలుగుఁ గాత." అని వరంబు లొసంగి తనలీలాకల్హారం బాతనిశిరంబుపై నుంప నాతనికి శ్రీపరంధాముఁ డైన గరళకంధరుని స్వరూపగుణవిభూతి విశేషంబులు, జీవాత్మపరమాత్మ విశేషంబులును, విమలస్వరూపాకారంబులును, లోక బంధం బైన సంసార నివృత్తిప్రకారంబులును, వైకుంఠదివ్యస్వరూపంబును, వేదశాస్త్రతత్త్వవిజ్ఞానంబును, నాతనికిఁ గరతలామలకంబుగ సుబోధంబు లయ్యె. అతఁ డాదృశ్యదర్శనానంద తన్మయుఁడై ప్రపంచంబు మఱచి యుండ నద్దేవీమూర్తి తిరోహితం బయ్యె.

తోడనే తండ్రియుఁ గొడుకునుఁ, గాఢనిద్రనుండి మేల్కాంచినతెఱం గున సమాగతప్రాణు లైరి. వెంటనే చంద్రహాసనరేంద్రునిపై దేవతలు పుష్ప వర్షముఁ గురిపించిరి. అరుదందునట్లు దివ్యదుందుభులు మ్రోఁగెను. నిలింపులు

దిగీశవ్రాతంబు గొనియాడె. పురజను లద్భుతరసనిమగ్నులై తండోపతండంబులుగ నాయాశ్చర్యముఁ గాంచ నరుగుదెంచుచుండిరి. కకుబంతములు వికాసముఁ జెందె. ఆకాశపర్యంతము జయజయధ్వానములు వ్యాపించె. దుర్మంత్రి లజ్జాపరవశుండై మోము వాంచి మాటిమాటికిఁ దా నొనర్చిన దుష్కార్యంబులఁ దలంచుచు, నిట్టూర్పులు నిగుడించుచుండె. భస్మములోపల న్మెఱియు విస్ఫులింగముకరణి మదనుండు తనకు వాటిల్లిన కడగండ్లు మఱచి యమాయకత్వంబునఁ బ్రకాశించె. ప్రజలహాహాకారము లడంగె. నరనారీజను లెల్లరు నా వైపరీత్యముఁగూర్చి యొకరితో నొకరు ముచ్చటింపం దొడంగిరి. అంతఁ గరుణారసవృష్టి నాశ్రితవిద్వత్కవిజనసదస్యసమితిపై వర్షింపఁజేయువాఁడును, యీవిని సకలయాచకజనకలకంఠవ్రాతంబునకు పల్లవితసహకారరూపుఁడు నగు, చంద్రహాసభూపవరేణ్యుఁడు, చండికాలయంబునఁ బౌరులు వచియించిన దుర్బోధలు మనసుఁ బెట్టక సంభ్రమానందవార్ధివీచికల దోఁగుచు నిశ్చలమానసుండై యద్దేవీమూర్తికిఁ బ్రణామంబు లాచరించి చిత్తంబు నత్తమిల్లంజేసికొని, మంత్రిని నాతని పుత్త్రినితో, బంగరుటరదంబుపై నెక్కించికొని వారి గృహంబున కరిగి సమ్మోదంబున వారిని నాదరించి ధామంబున నునిచె.

ఇట్లు కతిపయదివసంబులు కడచనునంతఁ జంద్రహాసుని పెంపుడుతలిదండ్రు లగు మేధావినీపుళిందులు చంద్రహాసుండు కుంతలపురంబున కరిగిన నాఁటనుండి పుత్త్రవియోగసంజనితదుఃఖానలసంతప్తు లగుచు “కట్టా! అనపత్యులమై చిరకాలంబునుండి దుఃఖించు మన కాముద్దులనిసుంగు శ్రీమన్నారాయణసేవామాహాత్మ్యంబున లభియించె. మూల్గుజంబుకంబుపైఁ దాళఫలంబు పడినచందంబున, మన భాగ్యభోగ్యంబులుఁ గాంచియో, మదనసముఁడైన కుమారమౌళినిఁ దెగటార్పఁ గ్రోధావేశ ముద్భవించియో మన వంశవృక్షంబునుఁ బెరికి సామ్రాజ్యసకలైశ్వర్యపెన్నిధుల వశపర్చుకొనుటకో, దుష్టబుద్ధి యేదో యొకకుతంత్రంబుఁ జేసి మనపత్తనంబుఁ జొచ్చి బిడ్డను

మాయోపాయంబున నొకకమ్మ యాతని తనయుని కొసంగు మని యిచ్చి పంపె. పోయినది మొద లింతకు నాతనిజాడయే లేదాయె, నేమి చేయుదుము. కుమారుని కెంతటిప్రమాదంబు సంభవించునో; మార్గాయాసంబునఁ గడు డస్సి కాలధర్మ మొందెనో; కుంతలరాజ్యంబుఁ గన్గొనలేక యేయేజనపదంబు లుత్తరించుచు నెవరిపంచఁ జేరి కబళంబు లాసించుచుండెనో; లేక దుష్టబుద్ధిప్రోద్బలంబున మదనుం డేమైనఁ బాపము గట్టుకొనెనా!" అని విలపించుచు దుఃఖితమానసులై యెట్టులో కాలముఁ గడపుచుండిరి.

కొండొకదివసంబునఁ జంద్రహాసునకుఁ బిన్నటనాఁటనుండి యత్యంత శ్రద్ధాభక్తులతోఁ బెంచి పెద్దవానిఁ జేసిన తలిదండ్రులగు మేధావినీపుళిందులు స్మృతికి వచ్చి, "కట్టా! ఔరసపుత్త్రునికంటె నెక్కుడగు ప్రేమానుబంధముతో సాఁకి పెద్ద జేసిన తలిదండ్రు లేమైపోయిరొకో; నన్నంటి వెంటాడు మిత్రకోటి యేమైపోయినదో; రాజ్యవైభవోన్నతు లెట్లైపోయెనొకో; బంధుజనంబులు నన్గాంచుట కెంత యాతురతతో నెదురు చూచుచున్నవారలో;" అని యిట్లు పరిపరివిధంబులఁ జింతించి, యొక్క భృత్యుని రావించి తన తలిదండ్రులఁ గొనిరమ్మని వార్త నంపె. అంత నాతఁ డతివేగంబునఁ జందనావతి కరిగి చంద్రహాసునివృత్తాంతంబు వారల కెఱిఁగించిన వా రమందానందంబు నొంది తనయునిఁ గాంచ నాతురులైనందున నావార్త విన్నంతనే సకలసేనాసమేతులై బయలుదేరి కుంతలపురంబునుఁ జేరి తనముద్దులపట్టి యగు చంద్రహాసునిఁ గనుఁగొని యాలింగనముఁ జేసికొని యథేష్టభోగంబుల సుఖియించుచుండిరి.

అంత నొక్కనాఁడు కౌంతలుండు చంద్రహాసునిఁ జేరంజీరి యుచితాసనంబున నుండ నియమించి రాజోపదేశంబు లుపదేశింప నుద్యుక్తుండై చెప్పఁదొడంగె.

"వత్సా! మనుజునకు పరువంబును, కలిమియును, దొరతనమును, అవిచారతయును అను నాల్గింటియందు నొక్కటేనియు నుండిన ననేకా

నర్థముల కాస్పద మగును. అట్టిచో మొదటిమూఁడును నినుఁ బొందియున్నవి. అధికారయౌవనబలంబున నహుషాదిమహనీయులే పెడఁద్రోవలఁ ద్రొక్కిరి. అట్టిచో నవయౌవనప్రాదుర్భావంబున నీబోంట్లయినను, బథంబు వీడ, పెడదారిని బడుట యసమంజసము కాఁజాలదు. అందుచే మాబోంట్లు నీబోఁటియువకులకు సద్బోధముచే సత్పథంబునఁ బ్రవర్తింప హెచ్చరిక చేయుట ధర్మము. అక్కారణంబున నీవు సకలరాజనీతిజ్ఞుండ వని యెఱింగియు గొన్నిధర్మంబుల నుపదేశింప నిన్నాహ్వానించితి. సావధానమనస్కుఁడవై యాలకింపుము. మనుజుఁడు దా నెచ్చటనుఁ బరుషవాక్యముల నాడకుండుటయుఁ, బాపపుకార్యంబులనుండి దూరముగ నుండుటయు, నను రెండుమార్గంబుల నుత్తముఁ డనఁబరగు. ప్రభు వగువాఁడు ప్రజలకు సమ్మతమగు మార్గంబున సంచరించుచు లోకనింద్యముల వదలిపెట్టుచుఁ బరునిసంపద కసూయపడక మను టొప్పును. కోపగుణమును, పొగడ్తలచేఁ బొంగిపోవుటయు, గర్వమును, తృప్తిలేకుండుటయు, దురభిమానమును, నిర్వ్యాపారత్వము నననివి కాపురుషగుణంబు లగుట మన్నెఱేఁడు వానినుండి విముఖుండు కావలయును.

మిత్రత్వంబు పాటించుటయు, సంభాషణం బొనర్చుటయు, వివాదంబును దిరస్కారంబునుఁ బ్రభువులు తమకుఁ దుల్యులతోడనే యొనర్పవలయును. కాని యధికులతోడను, హీనులతో..ను జేయుట కొఱకాదు. ఏకార్యము నైనను వేగపడి యొనర్చిన లేఁగాయను గోసినయప్పుడది చవిని విత్తు ననురెంటనుఁ జెడినట్లు కార్యభంగ మగుటయే కాక నిరతానర్థములును వాటిల్లును. తత్కారణంబున నేకార్యమేని దీర్ఘాలోచన మొనర్పనిదే చేయరాదు. జనంబులనుండి కరంబు గ్రహించుచో మాలకరి పుష్పములఁ గోయుమాడ్కియు, దేఁటి పువ్వుఁదేనియ గ్రహించుపోల్కియు నెదురు గందకుండఁగఁ గొనునదియే కార్యఫలము. బొగ్గులకుఁబోలె మొదటనే చెడుప రాదు. నేర్పరి యగు విలుకాఁ డొక్కశరమునుఁ బ్రయోగించుచో నది

తీసిన నొక్కనిప్రాణమునే తీయును. ఒకొక్కప్పుడు తప్పిపోయినను దప్పిపోవచ్చు. కాని నీతిఘ్నుఁ డగు నమాత్యుని నీతిస్ఫురణము శత్రురాజును, నాతనిరాజ్యమునుగూడ నాశన మొనర్చును. అందువలనఁ బ్రభువగువాఁడు నీతిఘ్ను లగు నమాత్యులఁ జేరఁదీసి వారి నుచితగౌరవముల సమ్మానించుచు, రాజకార్యనిర్వహణములందు వారియభిప్రాయములఁగొనుచు వారిబోధనలకు కేవలము వశ్యుఁడు గాక తనయింగితజ్ఞానమును సైత ముపయోగించుచుఁ బ్రజాహితకార్యముల నొనర్చుటయే శ్రేయస్కరము.

ప్రపంచములోఁ బలుతెఱంగుల మిత్రులు గలరు. అం దల్పసంఖ్యాకులుమాత్రమే యాపత్కాలమున నండయై దండ నిలిచెదరు. సుఖకాలమున మధురవాక్యంబు లాడువా రెల్లరు నిజమైనమిత్రులు గారు. భవిష్యదనర్థంబుల ము న్నెఱిఁగి యాపదలఁ గడువఁబెట్టువాఁడే నిజ మైనమిత్రుఁడు.

మేదినీభవు లని పేరు వడసి దుష్కృత్యములచే రాజశబ్దంబున కపార్థంబుఁగల్పించుట పాడిగాదు. స్వార్థపరత్వంబున సామంతుల నొంచి వారిధనంబు చూఱఁగొనవలదు. తొల్లి యొంటక న్నెఱుంగని రాజపుంగవుం డగునలుండు ద్యూతంబున సర్వస్వముఁ గోల్పోయి పుత్త్రికళత్రాదులఁ ద్యజించి కాంతారంబుల కరిగి పాంసుజాలంబుపై శయనించుచు ఘోరకష్టంబులఁ బడసె. కాన, నేనాఁడైన ద్యూతపానములపొంతకుం బోకుము. అనృతం బాడి స్వోదరపోషణార్థమై యర్థమును బొందుటకంటె మహాప్రస్థానమే మనుజులకు మేలు. లోనైన చూండలికుల బాధింపరాదు. కళాపూర్ణుం డగు నమృతకరుచందంబున రాజ్యపాలనం బొనర్చి కువలయామోదం బొనర్పవలయు. ఇఁక దారిద్ర్యమా; వాకిటిపొంతనుండి పొంచిపొంచి సమయమునకు వేచియుండు. దారిద్ర్య మతిఘోర మైనది.

సీ. దీపించునిర్మలతేజంబు లుడిగించు
రక్తమాంసములసారములఁ బిండు

మానాభిమానసంపద గంగపా ల్సేయు
భయపిశాచమునకుఁ బట్టి యిచ్చు
నిందుచింతావారినిధిమధ్యమున ముంచు
సాహసబీజంబు సమయఁజేయు
నతులపాపజ్వాల లంకుర మెత్తించు
పదుగురినవ్వులపాలు జేయు
గీ. బహుదురాలోచనల కెల్ల పాడిపంట
అసదృశాహ్లాదజలనిధి కౌర్వదహన
మసమదౌర్మార్గ్యమునకు నెయ్యపువయస్య
పృథివి వర్ణింప వశమె దారిద్ర్యమహిమ.

కాన జాగ్రత్తతో మెలఁగుము. పశ్చాత్తాపతప్తచిత్తు లగు నాశ్రితబృందంబుల దుష్టు లని శిక్షింపక ప్రియంబునఁ జేరఁదీసి రక్షించుటే రాజనీతి. సంసారసుఖంబులు బుద్బుదప్రాయంబులు. బల్లిదులు బీదలఁ దృణప్రాయంబుగాఁ జూచి బహుళకష్టంబులఁ బెట్టుట వాడుక. తద్రహస్యము చక్కఁగ నెఱుంగుము. దేశకాలపాత్రోచితంబు లగు కళలయం దారితేరి చక్కఁగాఁ బఠియించి నియతసత్యధురీణుఁడవై శుక్రుని సద్బోధనాపరంపరలు దెలిసి భవిష్యదర్థంబు లెఱుంగఁజాలు నమాత్యపుంగవుల సాయంబుఁ గొని భూచక్రంబు నవక్రపరాక్రమంబున సద్యశఃపాత్రుఁడవై పాలింపుము. బుధుల హితోపదేశంబున కావంతయేని జవదాఁటక యరిషడ్వర్గంబులపాలికిం బోక జారకామినీరతికేళీవ్యసనసంసక్తుఁడవు గాక బహిరంతరింద్రియనిగ్రహం బొనర్చి జగత్పూజ్యుఁడ వని విఖ్యాతి గడియించి మనుట పరమధర్మము.

శ్రీమదఖండమహీమండల మండనాయమానంబై హిమాచల వింధ్యాచల మాల్యవంత పారియాత్ర హేమకూటాది సప్తకులమహీధరంబులచేఁ బ్రభాసితంబై, భాగీరథీ యమునా నర్మదా బ్రహ్మపుత్రాది నదీతోయంబులచేఁ బూతం బగుచుఁ గశ్యపాత్రి భరద్వాజాది మహర్షిగణంబులకు జన్మ

స్థానంబై, తర్క వ్యాకరణ ధర్మశాస్త్ర మీమాంసా వైద్య వేదాంతాది షట్శాస్త్రంబులకు నిలయంబై, స్వాయంభువ స్వారోచిష ఔత్తమ తామసాది చతుర్దశమనుపరిపాలితంబై, చతుర్దశవిద్యలకు నికరంబై, బ్రాహ్మ పాద్మ వైష్ణవ శైవ లింగాద్యష్టాదశ పురాణములకును, సనత్కుమార నారసింహ స్కాంద శివధర్మ దౌర్వాసాద్యష్టాదశోపపురాణముల కాకరంబై, షట్చక్రవర్తులను హరిశ్చంద్ర నల పురుకుత్స పురూరవ సగర కార్తవీర్యార్జునాదుల జన్మంబులచే ధన్యంబై, నారసింహ వామన పరశురామ శ్రీరామ శ్రీకృష్ణాద్యవతారములచేఁ బవిత్రీభూతంబై యీభరతఖండ మలరారుచున్న యది.

అనాదినుండియు భారతీయులగు వీరభటులు, చెండురీతిఁ బ్రత్యర్థిభేద్యమై యలరారు తుహినాద్రినైన హస్తాగ్రంబులఁ బట్టియెగురవేయుటకును, కర్ణికమలాకరముఁ జొచ్చి కలగుండుపఱచులాగు సప్తసాగరంబులఁ గలవరపఱచుటకును, సింగంబులు కుంజరంబుల కుంభస్థలంబుల వ్రక్కలించుకైవడి దిక్కరులమూర్ధంబులఁ జీల్చుటకుఁ జాలియుండిరి. శిల్పకారులా, మయనిర్మితోదంచితకమనీయచిత్రంబుల నెగ్గాడి చూపరులదృష్టిపథంబులకు గోచరంబులై భ్రాంతి నాపాదింపఁజాలున ట్లపూర్వముగ ముజ్జగంబుల నొక్కపెట్టునఁ జిత్రింపఁగలయట్టివారు. అమాత్యాగ్రగణ్యు లన్ననో, శ్రీమంతులును, ధీమంతులును, స్వధర్మనిరతులును, జితేంద్రియులును, సుగుణకలాపసమన్వితులును, సనాతనధర్మపరాయణులును, స్వామికార్యతత్పరులునై వెల్గుచుండిరి. ఆహా! పతివ్రతాశిరోమణు లన్న, సావిత్రితోఁ దులఁదూఁగి భూజాతతో నుపమింపందగి కొండలసామికూఁతుతోఁ బంతగించి దమయంతికి సాటిఁ జెంది, యరుంధతికిఁ దుల్యలై హాటకగర్భురాణి నతిక్రమించి సాగరతనూజను నిర్లక్ష్యముఁ జేసి పుట్టినయింటికిని మెట్టినయింటికి ననుపమానకీర్తి నాపాదింపఁజాలిన మహాపతివ్రతామణు లందఱు భారతనారీమణులే!

కావున నీవు సత్కులసంభవముచేఁ జతుస్సముద్రముద్రితం బగు నీ మహీమండలమందు మహామోహాంధకారంబున కాకరం బైన తారుణ్యముచే నెంతమాత్రముఁ జొంగిపోక మెలంగుము. విద్వత్కవీంద్రు లెన్నఁడును నీ రాజ్యపరిపాలనక్రమం బీక్షించి శోకింపఁగూడదు. సజ్జనులవలన నిందను గురువరేణ్యులవలన ధిక్కారమును వేశ్యాంగనలవలన వంచనలును మరునిచే నున్మాదములు పొందకుండుము. మాహాత్మ్యంబుచే విజృంభించి విఖ్యాతు లగు పూజ్యుల నర్చించుచు భూసురోత్తములఁ బూజించుచు సామంతుల గౌరవించుచు వృద్ధజనోపదేశంబుల నాకర్ణించుచు, వందిమాగధుల స్తోత్రపాఠములకుఁ ద్రుళ్లిపడక సచివోపదేశంబుల నాత్మగతంబున వేదవాక్యంబులుగా భావించుచు మెలఁగుము. దుర్గుణములం దాఱితేఱి చరియించెదవా, నిన్నుఁ జూచి సంతోషించెడివా రెవరును లేరు. నీవు బాల్యావస్థందేయ సమస్తవిద్యలయం దారితేరినవాఁడవు. నీయౌవనపట్టాభిషేకమహోత్సవ మంగళాశీర్వాదంబు లనుభవింపుము. తదనంతరము నీయశోలతలు నలుదిక్కుల వ్యాపింపఁజేయుటకై దిగ్విజయార్థము పౌరుషజ్ఞానంబులతో దాడి వెడలుము. సకలజనకలికల్మషదోషాపహంబై సకలమంగళహేతుభూతంబై ముముక్షుజనముక్తికారణం బగుచు నొప్పారు నిర్భారతరాజ్యలక్ష్మి నీ భుజాదండంబున నాధారపడియున్నది.” అని యుపదేశించి విరక్తుండై కౌంతలనాథుండు తదీయశబలితకీర్తిచంద్రికలవెనుక నిలిపి భోగంబుల విసర్జించి యథేచ్ఛగా సాంద్రారణ్యములకుఁ దపంబున కరిగె. అంతఁ జంద్రహాసుండుఁ జంపకమాలినియందును, విషయయందును లోకత్రయంబుల గెలువంగల్గిన పద్మాక్షుండు, మకరధ్వజుండు, నను నిరువురు పుత్రులం బడసె. మహామహిమాన్వితుం డైనచంద్రహాససార్వభౌముండు శరణాగతాభీష్టప్రదాతయుఁ బ్రకృతిజనానందసంధాతయు, సర్వబంధుజనసంత్రాతయు నయి, ఘోరశాత్రవావళి నెల్ల మట్టుపెట్టుచు, న్యాయంబువీడి యన్యాయనిబద్ధకంకణులై విహరించు క్రూరభూపవరేణ్యులగర్వ మడంచుచుండె.

సీ. "పౌలోమిపాలిండ్లపంచఁ జెక్కిలిఁ జేర్చి
సుఖియించె బలపాలసుఖవిరోధి
జముఁడు నారకలోకసౌఖ్యోపదేష్టయై
వర్తించె నతిభద్రవర్తనముల
వరుణుండు గావించె సురతరుప్రసవని
ర్గళదచ్ఛమధుపాకకౌతుకంబు
వెలిఁ బాఱలైన వివిధనిధానంబుల
నర్థాధిపతి తెచ్చె నాలయమున

గీ. కాచరించిరి నిర్విఘ్న మగుతపంబు
మునులు కాలంబుఁ దప్పక చినికె మొగులు
నారసాతలధరణీసురాలయములు
పూర్వగతి నిచ్చెఁ జాంచల్యమును దొలంగి."

సీ. "కలుష సంఘాతంబు కడికండములఁ జేసి
దోషంబులకుఁ జేటు ద్రోవఁ జూపి
యేనస్సమూహంబు లీనంబు గావించి
వృజిననిర్బంధంబు వీడఁ దన్ని
అంహోనికాయోగ్రరంహంబు బిట్టాఁగి
దురితంబు లింతంత దూరము చేసి
దుష్కృతశతములు ధూళిలోఁ బ్రమ్మగ్గించి
పాపరూపము పటాపంచ చేసి

గీ. ధరణిధేనువు నాల్గుపాదముల నిలిచి
తుష్టిఁ బురుషార్థమయపయోవృష్టి గురియ
నేలె రాజ్యంబు ..............
నాలుగంచుల నవయౌవనంబునను."

సీ. "ధర్మప్రజాప్తికై ధరణీతలేశ్వరా
ర్చితకన్యకాశ్రేణిఁ బెండ్లియాడి
యవనీసురప్రీతికై న్యాయమార్గము
జరుపుచు విత్తంబు సంగ్రహించి
అధికకీర్తిప్రాప్తికై యెదిర్చిన వైరి
మండలాధీశుల మద మణంచి
దివిజసంతృప్తికై ధృతితోడ నశ్వమే
ధాధ్వరాదిక్రియ లాచరించి

గీ. అఖిల విద్యావిశేషంబు లభ్యసించి
డెంద మంతయు హరిభక్తియందు నిలిపి
గంధవద్వైరివంశ నిర్గంధనముగ
నవనిఁ బాలించె శ్రీచంద్రహాసుఁ డంత."

ముకుందచరణారవింద సంఘటితమానసుంబు మున్నూరువత్సరంబు లేకచ్ఛత్రంబుగా బంధుమిత్రపుత్రకళత్రసకల సంపత్పరంపరలచేఁ దులఁదూఁగుచు, బృందారకసందోహంబులచే సంస్తూయమానుం డగుచు, భాగీరథీవీచికాధారాప్రవాహంబున కెనయగు నిజకీర్తిప్రసారంబున రజనీచరచరిత్ర దుర్దమకర్దమసంక్షాళనం బాచరించుచు సింధునదీసవిధంబున వివిధమణిప్రభాశుభావహంబై రాజ్యపరిపాలనంబుఁ జేసె.

శ్లో. స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీంమహీశాః,
గోబ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినోభవంతు.



ఈ గ్రంథకర్తచే వ్రాయబడిన

# ఇతర గ్రంథములు

అముద్రితములు

---

భక్తవిజయము (నాటకము)

పుష్పకండోలము

భారవి

సైంధవపరాభవము (వచనము)

రుస్తుము & సోహ్రాబు

వలయువారు :—

యస్. నరసింగారావు పంతులుగారు,

హెడ్మాష్టరు,

బోర్డుస్కూలు, వినుకొండ.